# కోలాచలం శ్రీనివాసరావు

ఎస్. గంగప్ప, ఎం. ఏ., పి. హెచ్ డి.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

అకాడమీ ప్రచురణ నం. 17
నవంబర్, 1978
ప్రతులు — 1000

© A. P. SANGEETA NATAKA AKADEMI

సాదా ప్రతి : రూ. 2
గ్రంథాలయ ప్రతి : రూ. 4

*Cover Design:*
**V. Srnivasa Sarma**

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ,
కళాభవన్, హైదరాబాద్-500004.

Book Printed at Natyakala Press, Khairatabad
Cover Page Printed at Avon Printing Works, Hyderabad.

శ్రీ గంగప్పగారు 1960 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరులో ఎం. ఎ. పట్టం, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1972 లో 'కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాలపై రీసర్చి చేసి పిహెచ్. డి. పట్టం పొందారు. తెలుగుసాహిత్యం, నాటకసాహిత్యం, జానపదసాహిత్యాలపై సుమారు 40 పరిశోధన వ్యాసాలు ముద్రణకు నోచుకొన్నాయి. 'సుహాసినీ హాసం' నవలకు కర్తల ప్రస్తుతం ప్రభుత్వ కళాశాల, హైద్రాబాద్ లో ప్రధానాంధ్రోపన్యాసకులుగా ఉద్యోగం చేస్తున్నారు.

# తొలి పలుకు

సంగీత, నృత్య నాటకోత్సవాలను నిర్వహించటం, ఆ యా కళలలో శిక్షణాలయాలకు, సాంస్కృతిక సంస్థలకు, నిస్సహాయ స్థితిలో గల వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయము చేయటం, మరుగున పడిపోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతో పాటు ఆ యా రంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ చేపట్టింది. ఈ పథకం క్రింద సంస్కృతంలోని ప్రామాణిక సంగీత, నృత్యశాస్త్ర గ్రంథాలను అనువదింపజేసి ప్రచురిస్తున్నాము. ఇంతవరకు 'సంగీత రత్నాకరం' మొదటిభాగం, 'నృత్తరత్నావళి', కర్నాటక సంగీతానికి సర్వస్వంగా పేరుపొందిన "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" మొదటి సంపుటము ప్రచురించాము.

పూర్వగ్రంథాల అనువాదాలు, పునర్ముద్రణలు చేపట్టటమే కాక తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరచే స్వతంత్ర గ్రంథాలను ప్రచురించాలని కూడా అకాడమీ సంకల్పించింది. మొదట నాటక కర్తలను గురించి గ్రంథాలను ప్రచురించాలని

అకాడమీ నిర్ణయించింది. ఆప్రకారం నాటక కర్తలుగా చిలకమర్తి, తిరుపతి వేంకట కవులు గురించిన గ్రంథాలను ప్రథమంగా ప్రచురించాము. ఇప్పుడు ధర్మవరం, కోలాచలం గురించిన గ్రంథాలను వెలువరిస్తున్నాము. గురజాడ, కందుకూరి, వేదం ప్రభృతి నాటక కర్తలను గురించి క్రమంగా గ్రంథాలను ప్రచురించ సంకల్పించాము. అదే విధంగా సంగీత, నృత్య కళాకోవిదుల గురించి కూడా గ్రంథాలు ప్రచురించ తలపెట్టాము. అకాడమీ వెలువరిస్తున్న ప్రచురణలు కళాకారులకు, కళాభిమానులకు కూడా ఉపయోగకరం కాగలవని మా విశ్వాసము.

మేము కోరినంతనే ప్రసిద్ధ నాటకకర్తలు కోలాచలంవారి జీవిత చరిత్ర వ్రాసి ఇచ్చిన డాక్టర్ ఎస్. గంగప్పగారికి ధన్యవాదములు తెలియపరుస్తున్నాము.

కె. ఆర్. పరమహంస
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

# విషయ సూచిక

# జీవిత సంగ్రహ చరిత్ర

ఆంధ్ర నాటక కర్తలలో అత్యుత్తమ శ్రేణికి చెందినవారు కోలాచలం శ్రీనివాసరావుగారు; మహోన్నత రసవన్నాటక నిర్మాణానికి పూని సఫలీకృతమనోరథులైనవారు. అందునా అధికసంఖ్యలో చారిత్రక నాటకాలు రచించి "ఆంధ్ర చారిత్రక నాటక పితామహు" డన్న ప్రతీతికి నోచుకొని, "సుమనోరమసభా" నాటక సమాజాధ్యక్షుడుగా వ్యవహరించి, "వాణీవిలాస నాటకశాల" ను ప్రప్రథమంగా బళ్ళారిలో నిర్మించి, ఇతరుల కసాధ్యమైన "ప్రపంచ నాటక చరిత్ర" అనే ఉద్గ్రంథాన్ని ఆంగ్లభాషలో రచించి, ఆంధ్ర నాటక వాఙ్మయానికి, ఆంధ్ర నాటకరంగానికి ఎనలేని సేవగావించి ఘనత వహించిన శ్రీనివాసరావుగారు ప్రాతస్స్మరణీయులు.

కోలాచలం శ్రీనివాసరావుగారిది పండితవంశం. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరి వీరి పూర్వుడు. తాము కోలాచల మల్లినాథసూరి వంశీయులమని తమ "ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము"లో సప్రమాణంగా నిరూపించారు శ్రీనివాసరావుగారు. మల్లినాథసూరి 15 వ శ. పూర్వార్ధానికి చెందినట్లు శ్రీనివాసరావుగారు నిర్ణయించారు. ఈ 15వ శ. ఉత్తరార్ధంలోని వాడు మల్లినాథ ద్వితీయ పుత్రుడు కుమారస్వామి సోమయాజి. ఇతని పుత్రుడు మల్లిస్వామి

సోమయాజులు. ఈ విషయాన్ని ఒక దానపత్రం ధ్రువపరచినట్లు శ్రీనివాసరావుగారు వివరించారు; బళ్ళారి తాలూకాలోని 'ఊలూరు' గ్రామం మల్లిస్వామి సోమయాజులకూ, అతని పూర్వులకూ శ్రీకృష్ణదేవరాయలు అగ్రహారంగా దానమిచ్చినట్లు ఆ దానపత్రంలో కలదట; ఇతని పుత్రుడు కోలాచలం సర్వదేవసోమయాజులు. ఇతని పుత్రుడైన మల్లి శేషాద్రిదీక్షితులు "ఊలూరు" అగ్రహారం పోగొట్టు కొని మళ్ళీ 1569-82 మధ్యకాలంలో "అనంతపురం" పాళెగాడైన హండే హనుమప్ప నాయకుని వలన సంపాదించి ఉంటారని శ్రీనివాస రావుగారి నిర్ణయం.[1] మల్లి శేషాద్రి దీక్షితుల పుత్రుడు సూర్య నారాయణ. ఇతడు తన పుత్రుడు భాస్కరభట్టుతో పాటు నిజాం రాష్ట్రంలోని 'జంతకలం' లో స్థిరపడ్డాడు అతని పౌత్రుడు వేంకట రామదీక్షితులు మహావిద్వాంసుడై "గజేంద్రగడం" లో భూసంపదను సంపాదించాడు. అతనికి సుబ్బాశాస్త్రి, గంగాధరశాస్త్రి (శ్రీనివాస రావుగారి పితామహుడు), భాస్కరశాస్త్రి అని ముగ్గురు పుత్రులు. సుబ్బాశాస్త్రి మహాపండితుడు. శ్రీనివాసరావుగారి పితామహు డైన గంగాధరశాస్త్రి పరిసరాలలోని భూసంపదపై అధికారం కలిగి, "హంపీ" సమీపంలోని "కమలాపురం" లో స్థిరపడ్డాడు. ఇతని భార్య సుబ్బమ్మ. ఈ దంపతులకు సేతుయాత్ర అనంతరం పుత్రసంతానం కలుగగా, సేతుపతిశాస్త్రి అని నామకరణం గావించారు.

సేతుపతిశాస్త్రి పెరిగి పెద్దవాడయి, ఆనాడు ఆనెగొంది రాజయిన శ్రీమత్తిరుమల దేవరాయల వద్ద మంత్రి (దివాన్) పదవిని స్వీకరించి ప్రసిద్ధికెక్కారు. ఇతని భార్య అచ్చమాంబ. ఈ దంపతులకు ఆరుగురు సంతానం. వారిలో కనిష్ఠ పుత్రుడైన శ్రీనివాసరావుగారు,

---

1. C. P. Brown: "The Annals of Handeh Anantapur" ch. 1. p. 7, 8. Ed. by. G. V. AppaRao, B. A., F. M. V.

విరూపాక్ష క్షేత్రం సమీపంలోని కమలాపురమనే గ్రామంలో క్రీ. శ. 1854 సం. మార్చి 13 వ తేదికి సరియైన ప్రమాది సంవత్సరం ఫాల్గుణాసిత చతుర్దశినాడు జన్మించారు. వీరి అన్నగార్లు వేంకటరావు, వేంకటరామారావు అని ఇద్దరు. వీరుగాక తక్కిన ముగ్గురు పుత్రికలు. సేతుపతిశాస్త్రిగారు ఉత్తమగుణగరిష్ఠులు; ధైర్యస్థైర్యాలు, దయాధర్మాలు వారిసొత్తు. వారి గార్హస్థ్యజీవితం ఆనందమయంగా గడిచింది. వారి దివాన్‌గిరీలో ఆనెగొంది సంస్థానం సుఖశాంతులకు ఆటపట్టయింది. శ్రీనివాసరావుగారి తొమ్మిదోఏట 18 లో దివంగతులయ్యారు సేతుపతిశాస్త్రిగారు.

తమ వంశనామం 'కోలాచలం' అని ఎలా కలిగిందీ శ్రీనివాసరావుగారు వివరించారు. మల్లినాథసూరి పూర్వులు "ఊలూరు" సమీపంలోని 'పందిపాడు' లో నివసించే వారు. 'పందిపాడు' అన్న పదాన్ని మల్లినాథసూరి 'కోలాచల' అనిసంస్కృతీకరించాడు. అప్పటినుంచి వారికి 'కోలాచలం' వారని పేరు వచ్చింది. కానీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీనివాసరావుగారి వాదాన్ని స్వీకరించక, ఓరుగల్లు సమీపంలోని 'కొలచెలమ' అన్నదే మల్లినాథసూరి నివాసస్థలమని నిరూపించారు.[2] ఇది ప్రస్తుతం మెదక్ జిల్లాలో కలదు. ఇదే సరైనదని మరికొందరు విద్యావేత్తలు విశ్వసిస్తున్నారు. అయినప్పటికీ కన్యాకుమారివద్ద కూడ 'కొలచెర్ల' గ్రామం ఉంది. వ్రాత, అచ్చు ప్రతులలో మల్లినాథ సూరి ఇంటి పేరు 'కోలాచల' కొలచల, కోలచర్ల, కొలచెర్ల, 'కొలచెలమ'-అని అనేక విధాలుగా ఉండడంవల్ల ఇదమిత్థంగా నిర్ణయించి చెప్పడం కొంతవరకు కష్టసాధ్యమే. 'కోలాచల' శబ్దమే ఇన్ని విధాలుగా వికారం పొంది ఉండవచ్చుననడంలో సందేహం ఉండనక్కరలేదు.

---

2. చూడుడు:-'మీగడ తఱకలు' — పు. 190-207.

## బాల్యం, విద్యాభ్యాసం, ఉద్యోగం

శ్రీనివాసరావుగారు జననకాలం నుంచి తొమ్మిదేండ్ల వరకు మాత్రమే పితృప్రేమాదరణలకు, పోషణకు నోచుకున్నారు; అంత వరకు కమలాపురంలోనే పెరిగి పెద్దవారయ్యారు. కాని ఈసంతోషం ఎంతోకాలం కొనసాగలేదు. 1863 సం. లో తండ్రి సేతుపతి శాస్త్రిగారు దివంగతులయ్యారు. ఆ సమయంలో శ్రీనివాసరావుగారి బావ తిన్నవేలికుప్పుస్వామయ్యగారు వీరిని చేరదీసి ఆదరించారు. బళ్ళారికి కొనిపోయి, విద్యాబుద్ధులు గరపుతూ, సంరక్షిస్తూ శ్రీనివాస రావుగారికి తండ్రిలేని లోటును తీర్చారు కుప్పుస్వామయ్యగారు. అంతకుముందే శ్రీనివాసరావుగారి అన్న కోలాచలం వేంకటరావు గారు బావగారి ఇంటనే విద్యాభ్యాసంచేస్తూ ఉండేవారు. శ్రీనివాస రావుగారు బావగారి పోషణలో భయభక్తులతో విద్యాభ్యాసం చేయ నారంభించారు. వారు ఆంధ్రభాషతోపాటు సంస్కృతమూ, కాలో చితంగా ఆంగ్లభాషను అచిరకాలంలోనే అభ్యసించారు. వీటికితోడు కర్ణాటభాష అలవడింది. కుశాగ్రబుద్ధి అయిన శ్రీనివాసరావుగారు తమ పందొమ్మిదోపట 1873 సం. లో 'మెట్రిక్యులేషన్' పరీక్షలోనూ, 1876 లో అంటే 22 సం. లో ఎఫ్. ఏ. పరీక్షలోనూ ఉత్తీర్ణు లయ్యారు. మరొక విషయం శ్రీ వి. ఎల్. శాస్త్రి, శ్రీ ఎమ్. వేంకట రంగయ్యగార్ల సంపాదకత్వంలోని "Encyclopedia of the Madras Presidency and the Adjacent states" P 642- అనే గ్రంథంలో "Mr. K. Srinivasa Rao, B.A." - అని పేర్కొనబడి ఉండడం గమనించదగ్గది. కాని శ్రీనివాసరావుగారు బి. ఏ. అయినట్లు గాని, వాడుకలోగాని లేదు. వారు బి.ఏ. చదవనేలేదో, లేదా చదివినా డిగ్రీ తీసుకోలేదో మనకు తెలియరాలేదు. ఏమైనా ఆంధ్రాంగ్ల కర్ణాట సంస్కృతభాషా వేత్తలయి ఉత్తమజ్ఞాన సముపార్జన గావిం

చారు శ్రీనివాసరావు గారు. 'ఉద్యోగం పురుష లక్షణమ్' - అన్న సూక్తిని విశ్వసించిన శ్రీనివాసరావుగారు తమకాళ్ల మీద తాము నిలవదలచారు. ఉద్యోగప్రయత్నం కొనసాగించారు. ఫలితంగా 'రివెన్యూడిపార్టుమెంటు'లో వీరు అనంతపురంజిల్లా గుత్తిలో 12 సం.లు (1877-1889) ఉద్యోగం నిర్వర్తించారు. ఈ మధ్య కాలంలో కొన్నాళ్లు "1881 లో అనంతపురమండలము డిప్యూటి కలెక్టరుకడ దివానుగా"[3] సైతం పనిచేసినట్లు తెలియవస్తూంది స్వీకరించిన పనిని త్రికరణశుద్ధితో నిర్వర్తించడం శ్రీనివాసరావుగారిలోని గుర్తించదగిన ఉత్తమగుణం. పనిని ఎగవేసే పద్ధతి వీరి ఇంటావంటా లేనిది. ఉద్యోగ ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించడంవల్ల కార్యభారం అధికమై ఉండవచ్చు. "దొరతనపు వారి కొలువు బలు"వైనట్లూ, "ఆ వేతనాయాతనంబులన్నడి, రేయింబవళులు శరీరాయాసంబు"చెంది నట్లూ, [4] శ్రీనివాసరావుగారే పేర్కొవడం ఇందుకు నిదర్శనం. స్వేచ్ఛాజీవులూ, కళా పిపాసువులూ అయిన శ్రీనివాసరావుగారి కది గిట్టలేదు. 1889 సం.లో తమ 35 సం ల వయస్సులో ఉద్యోగానికి రాజీనామా చేసి, బళ్లారికి తిరిగి వచ్చారు శ్రీనివాసరావుగారు. వీరి ఉద్యోగం ఆ విధంగా పరిసమాప్తమైంది.

## న్యాయవాద వృత్తి.

శ్రీనివాసరావుగారు ఉద్యోగం వదలిపెట్టి బళ్లారి చేరే సరికి వీరి అన్న వేంకటరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదులై కీర్తి ప్రతిష్ఠ

---

3. శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్ర రచయితలు" —ప్రథమ భాగము— పు. 131, కలెక్టరువద్ద పనిచేసే వారిని 'దివాన్' అనడం వింతగా ఉంది. గుమాస్తాగాని, లేక "Camp clerk" గాని అయి ఉండవచ్చు.

4. సునందనీ పరిణయ నాటక పీఠిక—పు 1.

లతో పాటు ధనసంపాదన సైతం అధికంగానే చేస్తూ ఉండేవారు. వేంకటరావు గారు ఆదరాభిమానాలతో తమ్ముని చేరదీశారు. శ్రీనివాసరావుగారికి న్యాయవాదవృత్తిపై అభిలాషకలిగింది. అన్న గారి వద్ద ఉండడంవల్ల న్యాయస్థానపు చట్టాల పరిచయం, వాటి ప్రయోగ ప్రచార విధానాల్లో ప్రవేశం వీరికి లభించాయి. ఈ అనుభవంతో 'సెకండు గ్రేడు ప్లీడర్షిప్' పరీక్షలో కృతకృత్యులై 1892 సం. నుంచి స్వచ్ఛందమైన న్యాయవాదవృత్తి నవలంబించారు; అన్న గారితో పాటు బళ్లారిలోనే 'ప్రాక్టీసు' ప్రారంభించారు. వీరికి గల సహజ వాక్చైపుణ్యం, సంభాషణ చాతుర్యం న్యాయవాదవృత్తి కత్యంతం సహకరించాయి; అచిరకాలంలోనే డబ్బుతో పాటు పేరు కీర్తులు గూడ సంపాదించారు; వీరిలో సత్యనిష్ఠ, ధర్మవర్తన అధికం; బుద్ధినైశిత్యంతో పాటు పట్టుదల, కార్యదీక్ష, దక్షత వీరికి వెన్నతో బెట్టిన విద్యలు. కనుకనే వీరు తమవృత్తిలో మహోన్నతస్థాయినందు కొన్నారు.

శ్రీనివాసరావుగారి కంతకుముందే వివాహం జరిగి ఉండవచ్చు; అయినాఎప్పుడు జరిగిందీ తెలియదు. వీరిభార్య లక్ష్మమ్మ. వీరు అన్న గారి ఇంటనే సుఖమయ జీవితం గడుపుతూ ఉండేవారు. అంటే అది అవిభక్తకుటుంబం. ఆ నాటి "మద్రాసు ప్రెసిడెన్సీ" లోనే పేరు మోసిన వకీలుగా ప్రసిద్ధి ఉండేది వేంకటరావు గారికి. వీరు డబ్బు బాగా గడించిన వారు, వీరికానాడు ఒక కారు, 'కోచ్' (టాంగా) ఉండేవి. మహాదాతగా కూడ వీరికి ప్రసిద్ధి కలదు. వీరు ధనమున్నందుకు దానం చేయడమే ప్రయోజనమని ప్రగాఢంగా విశ్వసించినవారు. ప్రజాహితకార్యాలకై గుప్తదానాలెన్నో చేశారు; దేశాభిమానం, సంఘసంస్కరణాభిలాష వీరి సొత్తు. "జాతీయ కాంగ్రెస్"లో చేరి పనిచేసి జాతీయాభిమానాన్ని ప్రకటించినవారు. వీరు రూ. 50,000 వెచ్చించి బళ్లారిలో పురభవనం (Town-Hall) నిర్మింప జేసి, అంతే

డబ్బుతో ఒక గ్రంథాలయం స్థాపించారు. రూ. 7,000 లు వెల చేసే భవనం నిమ్నజాతుల బాలికల కోసం, రూ. 5,000 లు ఖర్చుతో మరొక భవనం వితంతువుల కోసం, రూ. 20,000లు వెలచేసే ఇంకొక భవనం అనాథశరణాలయం కోసం దానమొసగిన మహోదాతలు. ఇలాంటి దానధర్మాలు గావించిన వారి సంపాదన, సిరి సంపదలు ఎట్టివో స్పష్టం కాక మానదు. తమ ఏకైక పుత్రుడు 'రామచంద్రరావు' గారిని ఇంగ్లండుకు పంపి 'బారిష్టరు' చదివించిన ఘనులు వేంకటరావుగారు. రామచంద్రరావు గారు బారిష్టరు పట్టం పొంది స్వదేశం వచ్చాక బళ్లారిలోనే తండ్రివద్ద ప్రాక్టీసు ఆరంభించారు. ఈ విధంగా ఆనాడే అభ్యుదయ భావసంపన్నులై మహోన్నత వ్యక్తిగా ప్రసిద్ధి పొందారు వేంకటరావుగారు.

## నాటక రచన

ఉత్తమాశయులైన అన్నగారి ప్రభావం శ్రీనివాసరావు గారిపై ప్రసరించింది. ఇటు వృత్తిలోను, అటు సంఘ సంస్కరణ, సాంస్కృతికాది రంగాలలోను శ్రీనివాసరావు గారికి అన్నగారే ఆదర్శం. ఇట్టి సదవకాశంతో ఉచిత వాతావరణంలో శ్రీనివాసరావు గారికి సాహిత్య సమాలోచనపై ఆసక్తి కలిగింది. అప్పుడప్పుడు అనారోగ్యం పీడించినా, ఆ సమయంలోనూ గ్రంథపఠన కవకాశం కలుగుతూ ఉండేదని శ్రీనివాసరావు గారే పేర్కొన్నారు. కావ్య పఠన వ్యాఖ్యానాల్లోనే అధిక కాలం సద్వినియోగం చేసుకొనే వారు శ్రీనివాసరావు గారు. తెలుగు, ఇంగ్లీషు, కన్నడం, మరాఠీ భాషలలోనే గాక సంస్కృత భాషలోను అపారమైన పాండిత్యం కలవారు. అందునా మల్లినాథసూరి వంశీయులు. తమ పూర్వులందరు మహాపండితులు. ఆ నాడు బళ్లారి మునిసిపల్ హైస్కూల్లో హెడ్‌మాస్టరుగా పని చేస్తూండిన ఆర్కాటు భీమాచార్యులతో గాఢమైత్రి.

సంస్కృతాది భాషలలోని కావ్యనాటకాదులు భీమాచార్యులు గారు చదువుతూంటే శ్రీనివాసరావుగారు వ్యాఖ్యానించేవారు. ఈ కావ్య పఠన విమర్శలలో-అదే ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేస్తూండిన రావాడ వేంకటరామశాస్త్రిగారు సైతం పాల్గొనే వారు. ఈ సాహిత్యగోష్ఠి కోలాచలం వారి గృహంలో ప్రతిరాత్రి 12,1 గంటల దాక కొనసాగేది. భీమాచార్యులు మహా పండితులు. శ్రీనివాసరావుగారు వారితో సమానమైన పాండిత్య ప్రకర్ష కలవారు. ప్రతిభావంతులైన శ్రీనివాసరావుగారిలో ఈ విద్వద్గోష్ఠులు వైదు ష్యాన్ని పెంపొందించాయి. గ్రంథ రచన చేయాలన్న ఆకాంక్ష రావుగారిలో కలిగింది. బీజప్రాయమైన రావుగారిలోని ఆ కోరిక క్రమంగా మొలకెత్తి, చిగిర్చి, ఎదిగి, మహావృక్షమై నాటకాది వివిధ రచనల రూపంలో ఫలించింది.

'నాటకాంతం హి సాహిత్య' మ్మని పెద్దల ప్రసిద్ధమైన నానుడి ఉండగా కోలాచలం శ్రీనివాసరావు గారు మాత్రం 'నాటకాది సాహిత్యం'గా రచనా వ్యాసంగం కొనసాగించారు. ఇది వీరిలోని వైశిష్ట్యం. "అట్టికాలంబున (1892 సం. న్యాయవాదవృత్తి నవలం బించాక)నే వైజయంతీ విలాసంబను నాటకంబు నాలుగాశ్వాసం బుల (అంకములయి ఉండవచ్చు) వచన రూపకంబుగ లిఖంచితి" [5] నని శ్రీనివాసరావుగారు పేర్కొన్నారు. కాని వైజయంతీ విలాసం ముద్రితమైనటు కన్పట్టదు. ఇట్లు కోలాచలం వారి రచనా వ్యాసంగం ఆరంభమైంది. వీరు నాటక రచనకు పూనుకోవడానికి కారణా లున్నాయి. వీరు బళ్లారి చేరాక, సాహిత్య సాంస్కృతిక రంగాలలో కలుగుతూన్న అభివృద్ధి వీరికి దోహదం చేసి ఉంటుంది. వీరా సమ యంలో అనేక నాటక ప్రదర్శనలు దర్శించి ఉంటారు. ఆ రోజులలో

5. సునందనీ పరిణయ నాటక పీఠిక – పుట 1.

పూనా ధార్వాడల నుంచి కొన్ని నాటక సమాజాలు వచ్చి హిందీ, మరాఠీ, కన్నడ భాషలలో నాటకాలు ప్రదర్శిస్తూ ఉండేవి. స్థానికంగా శ్రీధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు మొదట కన్నడంలో ఉషానిరుద్ధమనే నాటకాన్ని, తరువాత తెలుగులో 'చిత్రనళీయం' నాటకాన్ని రచించి, 1886 లో ప్రదర్శించి సహృదయ సామాజికుల మన్ననలకు పాత్రులయ్యారు. అదేసంవత్సరంలోనే 'సరసవినోదినీసభా' నాటక సమాజం స్థాపించబడి ధర్మవరంవారి నాటకాలు ప్రదర్శించ బడుతూ వచ్చాయి. ఈ సందర్భంలోనే శ్రీనివాసరావుగారు గూడ నాటక రచన చేయడానికి ప్రయత్నించి ఉంటారు. మిత్రుల ప్రోత్సాహం కూడ దీనికి సహకరించి ఉంటుంది. విద్వద్గోష్ఠులలో కావ్య నాటకాదుల పఠన విమర్శనలవల్ల కల్గిన వైదుష్యం జతగూడింది. పఠించి, జీర్ణించుకొన్న సంస్కృతాంగ్ల రూపకాలు సైతం నాటక రచనకు శ్రీనివాసరావుగారిని పురికొల్పి ఉండవచ్చు. వీటన్నిటి ఫలితంగా వీరు రచించిన ప్రప్రథమ నాటకం 'సునందనీ పరిణయం' లేక 'దురాశాభంగం'. ఈ నాటకం 1892-93 సం॥ లలో రచించబడింది. అంటే అప్పటి నుంచి శ్రీనివాసరావుగారు న్యాయవాద వృత్తితో పాటు నాటక కర్తగా సైతం నిరూపించుకోడానికి ఆరంభించారు.

శ్రీనివాసరావుగారి నాటక రచనా కాలాన్ని స్థూలంగా మూడు దశలుగా విభజించవచ్చు. 1892 - 1899 ప్రథమదశ; 1899 1908 ద్వితీయదశ; 1909- ఆమరణం చివరిదశ.

ప్రథమ దశలో 'సునందనీ పరిణయం' తరువాత 1895 లో 'సుఖమంజరీ పరిణయం', 1895-96 లో 'మదాలసా' నాటకం, 1899 లో 'సీమంతినీ నాటకం' రచించబడ్డాయి. ఈ దశలోనే శ్రీనివాసరావుగారు ఉత్తమ నాటక కర్తగా గుర్తించబడ్డారు. పై నాటకాలన్నీ ప్రదర్శించబడుతూ వచ్చాయి. ధర్మవరం వారి నాటకాలు

'సరసవినోదినీ సభా' నాటక సమాజం వారిచే ప్రదర్శించబడేవి. అలాంటి నాటక సమాజం శ్రీనివాసరావు గారికి సైతం అవసరమైంది. బళ్లారిలో 1896–97 సం॥లో 'సుమనోరమసభా' నాటక సమాజం వెలిసింది. దీని స్థాపనలో పేర్కొదగిన ప్రముఖ వ్యక్తి శ్రీ పద్మనాభ వెంకోబాచార్యులుగారు. వీరికి తోడ్పడిన వారిలో శ్రీ సభాపతి మొదలియార్, జి. లక్ష్మణరావు, జి. క్రిష్టప్పచెట్టి, జి. కిష్టప్ప, ఎస్. నీలకంఠప్ప, ఎమ్. శీనప్ప మొదలైనవారుండేవారు. వీరందరు కోలాచలం వేంకటరావుగారికి, శ్రీనివాసరావుగారికి ఆప్తమిత్రులు. ఈ పురప్రముఖులు 'సుమనోరమసభా' నాటక సమాజం స్థాపించి శ్రీనివాసరావు గారిని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. శ్రీనివాసరావుగారు ఈ సమాజాధ్యక్షుడే గాక, నాటక కర్తగా, ప్రయోక్తగా సర్వమూ తామే అయి సమాజ కార్యకలాపాలు సమర్థవంతంగా కొనసాగించారు. కనుకనే వీరికి అనేక నాటక రచనా ప్రదర్శనలకవకాశం కలిగింది. వీరి నాలుగు నాటకాలు ఈ దశలోనే ముద్రించబడి పత్రికలలో కృతివిమర్శనకు సైతం నోచుకొన్నాయి. 1895 లో "సునందనీ పరిణయం", 1896 లో "సుఖమంజరీ పరిణయం", 1897లో "మదాలస", 1899 లో "సీమంతిని" ప్రథమ ముద్రణ పొందాయి. శ్రీనివాసరావుగారు తామే సొంతంగా వీటిని ముద్రింపించారు. 1895 జూలై "చింతామణి" పత్రికలో తత్సంపాదకులు శ్రీ న్యాపతి సుబ్బారావు గారు "సునందనీ పరిణయ" నాటకాన్ని మిక్కిలి ప్రశంసించారు. 1895 ఆగస్టు 'అముద్రితగ్రంథ చింతామణి'లో పత్రికాధిపతులు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు విమర్శించగా, దానికి సమాధానంగా శ్రీనివాసరావు గారొక చిన్న పుస్తక రూపంలో 16-10-1895 న ప్రకటించారు. దానికి ప్రతిసమాధానం పూండ్లవారు ఏప్రిల్ 1896 "అముద్రితగ్రంథచింతామణి"లో వెలువరించారు. 1897 జనవరి "అముద్రితగ్రంథ చింతామణి" లో

పూండ్ల వారు "సుఖమంజరీ పరిణయ" నాటక విమర్శనం విపులంగా చేశారు. దీనికి శ్రీనివాసరావు గారు "శశిలేఖ" పత్రికలో సమాధాన మివ్వగా, పూండ్లవారు 1897 ఏప్రిల్‌లో ప్రతివిమర్శన గావించారు. "మదాలసా" కృతి విమర్శనం 1897 ఫిబ్రవరి "చింతామణి"లో న్యాపతి సుబ్బారావుగారూ, 1897 జూన్ 'అముద్రితగ్రంథ చింతామణి'లో పూండ్లవారూ చేయడం జరిగింది. 'సీమంతినీ' నాటకాన్ని 1900 డిశంబరు 'మంజువాణి'లో తత్సంపాదకులు రాజామంత్రి ప్రగడ భుజంగరావుగారు సమీక్షించారు. 'సునందనీ పరిణయం' 1898 లో ద్వితీయ ముద్రణకు, 1907 లో తృతీయ ముద్రణకు, 1924 లో చతుర్థ ముద్రణకు నోచుకొన్నది. ఇది 1899 సం॥లో ప్రథమశాస్త్ర పరీక్ష (F.A)కు పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడింది. దీనికి టిప్పణం సంతరించారు శ్రీనోసం నరసింహాచార్యులుగారు, శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిలు మొదలుకొని పెనుగొండ శ్రీ రొద్దం హనుమంతరావు గారి వరకు గల ఆ నాటి ప్రముఖాంధ్ర కవి పండితుల ప్రశంసలనందుకొన్నది 'సునందనీ పరిణయము.' ఇట్లు శ్రీనివాసరావు గారి యశశ్చంద్రికలు దశదిశలా వ్యాపించాయి. మరొక విశేషం వీరి సాహిత్య మూర్తికి నిదర్శనమైనది కలదు. శ్రీనివాసరావుగారు 'కవి పండిత సంఘం'లో సభ్యులుగా ఉండేవారు. 1897 లో ఆంధ్ర దేశంలోని కవిపండితులుచేరి ఒక సంఘంగా ఏర్పడ్డారు. దీని నిర్మాత ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు. ఈ సంఘప్రథమ సమావేశం 1897 ఏప్రిల్‌లో బళ్లారిలోనూ, ద్వితీయ సమావేశం 1899 జనవరి 1 వ తేదీన మద్రాసులోనూ జరిగాయి. రెండో సమావేశంలో వేదం వేంకటరాయశాస్త్రిగా రుపన్యసించిన పాత్రోచిత భాషపై వాదోపవాదాలు జరిగాయి. వీర గ్రాంథిక వాదులైన కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి పక్షంలో కోలాచలంవారు, ధర్మవరం వారు, వేంకట సుబ్బయ్యగారు, వావిలికొలను వారు చేరిపోయారు.

పూాండ్లవారు, శ్రీపాదవారు మొదలైనవారు వేదం వారి పక్షంలో చేరారు. నాటకంలో గ్రామ్యముపయోగించాలన్నది వేదం వారి సిద్ధాంతం. ఉపయోగించరాదన్నది కొక్కొండ వారి మతం. శ్రీనివాసరావు గారు సైతం ఒకటి రెండు నాటకాల్లో ఎక్కడో ఒక చోట నీచపాత్రలకు గ్రామ్య భాష ప్రయోగించినా, సర్వత్ర తత్ప్రయోగం అనుచితమనీ, తన్మూలంగా భాష చెడుననీ అభిప్రాయపడ్డారు ఇంతేగాక పూండ్లవారు కొక్కొండ, ధర్మవరం, కోలాచలం వారల నాటకాలను విమర్శించి ఉండడం వల్లా వీరందరూ ఒక కూటమిగా చేరి ఉంటారని తలంచవచ్చు. శ్రీనివాసరావు గారి దశలోనే కవిపండిత సంఘాల్లో పాల్గొనే వారని తెలుపడానికే ఇంతగా వివరణ అవసరమైంది.

ద్వితీయదశ 1899–1908 మధ్య కాలంలో శ్రీనివాసరావు గారు అత్యుత్తమ నాటక కర్తగా లబ్ధప్రతిష్ఠులయ్యారు. సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్ర, శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయం, ప్రతాపాక్బరీయం—అనే ఎనిమిది ఉత్తమశ్రేణి నాటకాలు క్రమంగా రచించి ప్రసిద్ధి పొందారు. ఇందులో ఐదు చారిత్రకాలు. 'సుఖమంజరి పరిణయం' తోనే చారిత్రక నాటక రచన ఆరంభమైనా, ఈ ద్వితీయ దశలోని చారిత్రక నాటకాలే శ్రీనివాసరావుగారికి ఎనలేని కీర్తినే గాక 'ఆంధ్రచారిత్రక నాటక పితామహు'డన్న ప్రతీతిని కూడ సంపాదించి పెట్టాయి. సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్ర, సత్యహారిశ్చంద్రీయం—అనే మూడు నాటకాలు 1907, 1908 సం లలో ముద్రించబడ్డాయి. శ్రీనివాసరావు గారికి నాటక కర్తగా వచ్చిన కీర్తిప్రతిష్ఠలకు 'రామరాజు చరిత్ర' జయపతాక. ఇది ఎం. ఏ. డిగ్రీ పరీక్షకు పాఠ్యగ్రంథంగా ఒకప్పుడు నిర్ణయించ బడింది. 'ప్రతాపాక్బరీయ' నాటక

రచనా కాలంలో కలిగిన సంతానానికి ప్రతాపరావని నామకరణం చేశారు రావుగారు. ప్రతాపరావు వీరిచివరి పుత్రుడు. 1907—1908 సం.లో వీరి జననం. వీరి అక్కగారు సునందనమ్మ. ఈమె 'సునందనీ పరిణయ' నాటక రచనా కాలం 1892—93 లో జన్మించింది. కనుకనే 'సునందనమ్మ' అనే పేరు వచ్చింది. ప్రతాపరావు గారి అన్నగార్లయిన శత్రుఘ్నరావు, శ్రీరామరావు, జయరత్నం—అన్న వారితో రావుగారికి మొత్తం ఐదుమంది సంతతి. ఇంకొక విశేషం. అవిభక్త కుటుంబంలోని అన్నదమ్ములు తమ సంతతికి రామాదుల పేర్లుంచడం గమనించదగ్గది. వేంకటరావుగారి పుత్రుడు రామచంద్రరావు. వేంకట రామారావుగారి పుత్రులు భరత లక్ష్మణులు. వరుసక్రమంలో మొదటి పుత్రుడు శత్రుఘ్నరావు. ఒక ప్రక్క ఈ విధంగా సుఖసంతోషాలతో గార్హస్థ్య జీవితం గడుపుతూ మంచిమంచి నాటకాలు రచించి ప్రదర్శనలిస్తూ, విజయం చేకూర్చుకొంటూ కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తూవచ్చారు రావుగారు. వారి పట్టుదల కార్యదీక్షాదక్షతలట్టివి! ఇందుకు మరొక నిదర్శనం సైతం ఉంది. వీరు ప్రప్రథమ నాటకశాలా నిర్మాతగా గూడ ఘనత వహించారు. వీరి నాటక ప్రయోగాలకు ఉత్తమశ్రేణి నాటకశాల ఆవశ్యకమైంది. చేదోడు వాదోడుగా ఉండిన మిత్రుల ప్రోత్సాహమూ, సిరిసంపదలతో తులతూగుతూండిన అన్న వేంకటరావు గారి అండదండలు సమకూరాయి. మహామేధావి శ్రీనివాసరావుగారు 1905 సం.లో బళ్లారిలో పదివేల రూపాయలు వెచ్చించి 'వాణీవిలాస నాటకశాల'ను నిర్మింపజేశారు. దీనిని బ్రహ్మశ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్కుగారు ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవంలో తిలక్‌గారు శ్రీనివాసరావుగారి అట్టి నాటకశాలా నిర్మాణదక్షతను మిక్కిలి ప్రశంసించారు. ఆ సభలోనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణను గూర్చి చక్కని ఉపన్యాసమిచ్చారు. ఉత్తమనాటకశాలా నిర్మాతగా, ఉత్తమశ్రేణి

నాటక కర్తగా శ్రీనివాసరావుగారు శ్రీతిలక్ మహాశయుల ప్రశంస లందడం కొనియాడ దగ్గది. ఈ నాటకశాలా నిర్మాణమొక అపూర్వ సంఘటన. బళ్ళారిలోనే కాదు యావదాంధ్రదేశంలోనే అంతవరకు ఇలాంటి నాటకశాల లేదంటే అతిశయోక్తికాదు. వీరు నాటకరచనా ప్రయోగాలతో సంతృప్తి చెందక నాటక లక్షణం, చరిత్ర రచించారు. ప్రపంచ నాటకాల చరిత్రను అంగ్లంలో విరచించారు. అదే 'ప్రపంచ నాటక చరిత్ర' (The Dramatic History of the World). ఈ ఉద్గ్రంథం వీరికి గల భారతీయ పాశ్చాత్య రూపకపఠనజన్య జ్ఞానానికి పరమ నిదర్శనం. ఇట్టి రచనలో ఆంధ్రదేశంలోనే గాదు, భారతదేశం లోనే ఇది ప్రప్రథమ ప్రయత్నమనవలసి ఉంది. అట్టి ఘనత శ్రీనివాస రావుగారికి దక్కింది. వీరీ గ్రంథాన్ని 1908 లో ముద్రింపించారు. ఈ దశలోనే శ్రీనివాసరావు గారి మనస్సు పారమార్థికం వైపు మొగ్గి ఉండవచ్చు. ఆధ్యాత్మిక చింతనతో భగవద్గీత, వేదాలను సవి మర్శకంగా పఠించి తెలుగున ఉపన్యాసాలుగా రచించి సభలలో ఉప న్యసించ ప్రారంభించారు. శ్రవ్యకావ్యం పైన గూడ ఆసక్తి కలిగి సంస్కృత అగస్త్య బాలభారతంలోని 'ఆదిపర్వం' తెనిగించి 1908లో ప్రకటించారు. ఈ రెండోదశ శ్రీనివాసరావు గారి జీవితంలో చాల ప్రాధాన్యం గలది. ఉత్తమ నాటక రచనా ప్రయోగాలు, నాటక సమాజ స్థాపన, నాటకశాలా నిర్మాణం, ప్రపంచనాటక చరిత్రరచన, శ్రవ్యకావ్యం, వచన రచనలుచేసి రావుగారు అత్యున్నత స్థానం ఆక్ర మించుకొన్నారు. మహోన్నత వ్యక్తిగా నిరూపించుకొన్నారు.

1909 నుంచి శ్రీనివాసరావు గారు దివంగతులయ్యేంత వరకు గల కాలాన్ని చివరిదశ అంటున్నాం. ఈ దశలోనే శ్రీనివాసరావుగారి నాటకాల్లో వైవిధ్యం కనిపించడం, విరివిగా వచనరచనలు చేయడం, సంఘ సంస్కర్త కావడం, విద్వత్సభకధ్యక్షత వహించడం జరిగింది. ఈ సమయంలో రచించిన వాటిలో రెండు చారిత్రకాలున్నా, పౌరాణి కాలే అధికం. 1909 లో "కుశలవ", 1912 లో 'ప్రహ్లాద' రచితాలు.

అతఃపూర్వమే ధర్మవరం వారు "ప్రహ్లాద" రచించి పోతనకవి పద్యాలనే ప్రయోగించడంవల్ల శ్రీనివాసరావుగారు గూడ 'ప్రహ్లాద' రచించి, సొంతంగా పద్యాలు వ్రాశారు. సుమారు సగానికి సగం నాటకాలు, ఇతర రచనలు చేయడం ఈ దశలోనే జరిగింది. భారతరామాయణ నాటకాలు శ్రీనివాసరావుగారు పూర్తిచేశారు; రెండు మరాఠీ నాటకాల్ని తెనిగించారు. 1915–16 సం. లో పూనానుంచి "కేశవ గంధర్వ", 'బాలగంధర్వ'అనేనాటకకంపెనీలు బళ్ళారికివచ్చి ప్రదర్శనలిచ్చిన, "మానాపమానం, రాతుసీమ హత్యాకాంతు" అనే రెండు మరాఠీ నాటకాల్ని దర్శించిన శ్రీనివాసరావుగారు అనువదించి ఆంధ్రులకు మరాఠీ భాషాసాహిత్యాల రుచి చూపారు. "యువతీ వివాహ"మనే సాంఘిక నాటకం సైతం వ్రాశారు. కన్నడభాషలో 'ఆచారమ్మన ప్రహసనవు', తెలుగులో "నాచిపార్టి", "అన్యాయ ధర్మపురీమహిమ", "సమయమునకు భార్య" అనే ప్రహసనాలు రచించారు.

## సంఘసంస్కరణ, పత్రికాప్రకటన

ఈదశలోనే శ్రీనివాసరావుగారు సంఘసంస్కర్తగా వెలుగులోకి వచ్చారు. అన్న వేంకటరావుగారి అడుగుజాడలలో నడచిన వీరికి గూడ సంఘసంస్కరణపై అభిలాష అధికం. ఆనాటి అనాచారాల్ని గర్హించి, మూఢ విశ్వాసాల్ని తిరస్కరించారు. శ్రీనివాసరావుగారు వేదం సమగ్రంగా పరిశీలించి, వేదం ఆర్యుల చరిత్ర అని నిరూపించి, అతిబాల్య, వృద్ధవివాహాలు, సతీసహగమనం మొదలైన దురాచారాలు వేదంలో లేవనీ, తరువాత అవి ఆపద్ధర్మాలుగాకల్పించబడ్డాయనీ, ఆపద్ధర్మం సంప్రదాయం కాజాలదనీ, జాతిమతభేదాలు కల్పితమనీ, మనుసంతతి అయిన మానవసంఘమంతా ఒకేజాతి అనీ వేద విమర్శనోపన్యాసాల్లో వివరించారు. ప్రజలను విజ్ఞానవంతులుగా

చేసి, తన్మూలంగా సంఘాన్ని ఉద్ధరించి, దేశాభివృద్ధి చేయాలని తలంచారు రావుగారు. ప్రజోపయోగంకోసం 1913 మే నెలనుంచి "వేదార్థ చంద్రిక" అనేపత్రికను ప్రకటించనారంభించారు. ఆపత్రికాధిపతులలో రావుగారు ప్రధానవ్యక్తులు. సంస్కృత భాషలోని వేదాల్ని తెనిగించడంలో వీరే ప్రథములు. సంఘ సంస్కరణాభిలాషులైన శ్రీనివాసరావుగారు భాషా సంస్కారాన్ని కోరలేదు. అంటే వీరు గ్రామ్యభాషా ప్రయోగానికిచ్చగించలేదు. 1913 సం. లో మద్రాసు విశ్వవిద్యాలయం నియమించిన 'గ్రామ్య భాషాప్రయోగావశ్యకా' న్ని గూర్చి నివేదికను సమర్పించవలసిన కార్యవర్గం (composition committee) లో వీరు సభ్యులు. ఇందులో గ్రాంధిక, వ్యావహారిక భాషావాదులని రెండు తెగలవారుండేవారు. శ్రీనివాసరావుగారు గ్రాంధిక భాషావాదులు. సంఘసంస్కరణలో కందుకూరివారి ననుసరించినా, భాషాసంస్కారంలో గురజాడ, గిడుగువారల మార్గం గ్రహించలేదు.

ఈ సమయంలోనే శ్రీనివాసరావుగారు ఆంధ్రసాహిత్య సభలలో పాల్గొనే అవకాశం కల్గింది. ఆంధ్రసాహిత్య పరిషచ్చతుర్థ వార్షికోత్సవ సభ 1915 సం. ఏప్రిల్ నెల 3, 4 తేదీలలో బళ్ళారిలో కోలాచలం వేంకటరావుగారు నిర్మించిన పురభవనంలో జరిగింది. శ్రీనివాసరావుగారా సభలో స్వాగతోపన్యాసమిచ్చి, ఆంధ్రనాటకాల గూర్చిన వ్యాసం చదివారు. ఆ మరుసటిరోజు వీరు 'ఆర్యులనాగరికత, వారి దేశాక్రమణం' గురించిన వ్యాసం చదివారు. మొదటిరాత్రి శ్రీనివాసరావుగారి "రామరాజు చరిత్ర" నాటకం పరిషత్సభ్యుల సంతోషం కోసం ప్రదర్శితం. అందులో బళ్ళారి రాఘవాచార్యులు గారు పఠాన్ పాత్ర ధరించి, తమ నటనాచాతుర్యాన్ని ప్రకటించి సామాజికుల మన్ననలకు పాత్రులయ్యారు. ఇంతకంటె శ్రీనివాసరావుగారి జీవితంలో ప్రధానమైన ఘట్టం మరొకటి కలదు. 1917 సం. ఏప్రిల్

నెల 7, 8 తేదీలలో కడపలో నిర్వహించబడిన ఆరవ ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభలో అగ్రాసనాధిపతులుగా వ్యవహరించారు రావు గారు. ఉపక్రమోపన్యాసంలో ఆంధ్రభాషాచరిత్రలకు సంబంధించిన విషయాలు విపులంగా చర్చించారు. ఉపసంహారోపన్యాసంలో వీరి విమర్శనాత్మక దృష్టి, విచక్షణజ్ఞానం, మాట నేర్పు, శ్రోతలను ఆకట్టుకోగల చతురత స్పష్టంగా వ్యక్తమయ్యాయి. సభలలోని ఉపన్యాసాల్ని చాకచక్యంతో సమీక్షించి, "మనుచరిత్ర" లోని 'ఇంతలు కన్నులుండ' పద్యం ఉదాహరించి వీరు కావించిన వ్యాఖ్యానం అనితరసాధ్యం. మహావిద్వత్సభకు అధ్యక్షులు కావడం రావుగారిప్రతిభా వ్యుత్పత్తులకు నిదర్శన మనక తప్పదు.

శ్రీనివాసరావుగారు వేదభగవద్గీతా విమర్శనోపన్యాసాలేగాక, ఇతర విషయాలను గూర్చి కొన్ని వ్యాసాలు వ్రాశారు. వీరి చివరి వ్యాసం 8-1-1919న రచించిన "భాసకాళిదాస విక్రమాదిత్యుల కాలనిర్ణయం" అన్నది. అంతకు ముందే 25-7-1918 న 'ప్రాచీన గ్రంథాలయ చరిత్ర' రచితం. చివరినాటకం 'పాదుకాపట్టాభిషేకం' —1918-19 లో రచితం. ఈ నాటకరచనా కాలానికి 'సుమనోరమా సభా' నాటకసమాజకార్యకలాపాలుఆగిపోయినట్లు పీఠికవల్ల తెలుస్తూంది. తత్స్థానంలో మరొక నాటకసమాజం వెలసినట్లు సైతం విశదమవుతూంది. శ్రీనివాసరావుగారి నాటకాలు 'సుమనోరమ సభా' నాటక సమాజం వారు ప్రదర్శిస్తూ ఉండేవారనీ వీరు తమ నాటక పీఠికలలో చెప్పుకొన్నారు. శ్రీనివాసరావుగారు ఆమరణమూ నాటకాలతో పాటు ఇతర వచనరచనలు గూడచేసి, నాటకరంగంలోనే గాకసాహిత్య రంగంలోను లబ్ధప్రతిష్ఠులయ్యారు. సుఖమయమైన సాంసారికజీవితంతో పాటు, సాంస్కృతిక రంగంలోను పురోగమించారు. ఆర్థికమైన ఇబ్బందులు లేవు. నాటకరచనా ప్రయోగాలలో, విద్వద్గోష్ఠులలో, కావ్యపఠన విమర్శలలో, సభలలో పాల్గొంటూ, ఒకప్రక్క న్యాయవాదవృత్తిని

కొనసాగిస్తూ హాయిగా కాలం కొనసాగించారు. వీరు ఏకార్యమైనా పట్టుదలతో, త్రికరణశుద్ధిగా నిర్వర్తించిన వారు అయినా వీరిని అప్పు డప్పుడు అనారోగ్యం పీడించేది. అనారోగ్య సమయంలోనే రచనా వ్యాసంగం కొనసాగేది. అనారోగ్యం లెక్క చేయక వీరు ఆంధ్ర సాహిత్యానికి సేవచేసిన మహానుభావులు.

## జీవిత పరిసమాప్తి

తమ రచనలన్నింటిని ముద్రింపించి శాశ్వతం చేయాలనీ, తన్మూలంగా భాషాసాహిత్యాభివృద్ధి కావించాలనీ ప్రగాఢంగా ఆకాంక్షించిన వారు శ్రీనివాసరావుగారు. అందుకే "Let the dramatist not keep his plays in manuscripts. Let his dramas be printed and thus become literary and living dramas.[6]" అని కంఠోక్తిగా చెప్పగలిగారు. కనుకనే తమ ప్రథమ ద్వితీయదశలలోని నాటకాలను, ఇతర రచనలను ప్రకటించిన సంగతి ముందే ముచ్చటించడం జరిగింది. శ్రీనివాసరావుగారు తమ రచన లన్నింటిని ముద్రింపించదలచి, సర్వం సిద్ధంగావించుకొని, ముద్రణార్థం మద్రాసుకు వెళ్ళడానికి నిర్ణయించుకొన్నారట. అపుడపుడు పొడ చూపుతూండిన అనారోగ్యం అధికమై ఆదేతేదీన మద్రాసుకుగాక శాశ్వ తంగా స్వర్గానికి రావుగారిని కొనిపోయిందట! ఈ విషయం వీరి జ్యేష్ఠపుత్రులైన శ్రీశత్రుఘ్నరావుగారు "మా తండ్రి గారు కోలా చలం శ్రీనివాసరావుగారు తమవలనఁ జేయఁబడిన నాటకము లన్నియు ముద్రింపించుటకు 1919సం. జూన్ 23 వ తేదీ చెన్నపురికి పోవలెనని నిశ్చయించుకొనియుండిరి. ఇట్లుండ జూన్ 19వతేదీ మొదలు రాజవ్రణ పీడితులై 1919 సం. జూన్ 23 వ తేదినాడే యస్తమించిరి[7]." అని

---

6. The Dramatic History of the World-Rules No.18;p.3

7. కుశలవ నాటకపీఠిక-పుట. 4.

తమ విషాదాన్ని ప్రకటించి ఉన్నారు. ఉత్తమాంధ్ర నాటకకర్త, "ఆంధ్ర చారిత్రక నాటక పితామహుడు" తమ జీవితాన్ని ఆవిధంగా చాలించారు. వారి సాహిత్యమూర్తి మాత్రం శాశ్వతంగా నిలిచింది. ధర్మవరంవారి తరువాత ఏడేండ్లకు రావుగారు కన్నుమూశారు. కందుకూరివారు కోలాచలం వారికంటె ఒక నెల ముందే దివంగతులయ్యారు. సంఘసంస్కరణ, సాహిత్య సేవలందు కందుకూరివారి ప్రక్కనే ఉండదగిన కోలాచలంవారు, కందుకూరివారి మరణానంతరం ఎంతోకాలం భూమిపై నివసించ నిచ్ఛగించక, వారి వెనువెంటనే పరమపదించారు. తండ్రి మరణానంతరం, కోలాచలం వారినాటకాల్ని, ఉపన్యాసాల్ని పూర్తిగా ముద్రింపించి, తండ్రి రచన లన్నింటిని వెలుగులోకి తెచ్చి, తండ్రి ఆశయాన్ని నెరవేర్చిన ఘనతను సంపాదించిన ఉత్తములు శత్రుఘ్నరావుగారు; ఆంధ్రుల అభినందనలకు పాత్రులు.

# నాటకేతర రచనలు

కోలాచలం శ్రీనివాసరావు గారి సాహిత్య సమాలోచనలో వారి నాటకసాహిత్యానికే అత్యధిక ప్రాముఖ్యమున్నప్పటికీ నాటకేతర రచనలనుగూర్చి గూడ తెలుసుకొన్నప్పుడే సమగ్రమవుతుందనడంలో సందేహంలేదు. శ్రీనివాసరావుగారి రచనలను నాటకాలు, నాటకేతర రచనలని స్థూలంగా వర్గీకరించవచ్చు. ఈ నాటకేతరరచనలను-పద్యకావ్యం, విమర్శన అని అంతర్విభజనచేయవచ్చు; విమర్శనను మళ్ళీ ఆంగ్లం: తెలుగుఅని విభజించవచ్చు; తెలుగువిమర్శనను మళ్ళీ భగవద్గీతా విమర్శనోపన్యాసాలు, వేదవిమర్శనోపన్యాసాలు, ఇతర విమర్శనోపన్యాసాలు-అని వర్గీకరించినట్లైతే అతిసూక్ష్మంగా శ్రీనివాసరావుగారి నాటకేతర రచనల గూర్చి తెలుసుకోవడానికి వీలుంది. కనుకనే నాటకేతర రచనలను క్లుప్తంగా మొదటే ముచ్చటించడం ముఖ్యం. శ్రీనివాసరావుగారి నాటకేతివృత్తాల్లో వైవిధ్యమున్నట్లుగానే, ఇతరరచనల్లోను వైవిధ్యమెక్కువ. వీటివల్ల రావుగారి బహుముఖప్రతిభ ప్రకటితమవుతుంది.

## ఆంధ్రీకృతాగస్త్య బాలభారతం

శ్రీనివాసరావుగారి పద్యకావ్యం 'ఆంధ్రీకృతాగస్త్య బాల భారతం'. ఆరంభంలో నాటకరచనచేసినా పద్యకావ్యాన్ని సైతం

అనువదించాలని వీరికి ఆకాంక్షకలిగింది. ఆదిపర్వంలోని ఆరు సర్గాలను మూడాశ్వాసాలుగా శ్రీనివాసరావుగారు అనువదించారు. తక్కిన భాగం వీరెందుకు వ్రాయలేదో తెలియరాదు. ఆంధ్రీకృతాగస్త్యబాల భారతం శ్రీనివాసరావుగారి పద్యరచనాపాటవం, వర్ణనావైదగ్ధ్యం, ఆలంకారికశైలీ విన్యాసం మొదలైన కవితాగుణాలకు ఆటపట్టు. ఇందులో కథాకథనం పురాణపద్ధతిలో సాగినా, ప్రబంధశైలి కలదు. తృతీయాశ్వాసంలో వివిధ వృత్తాల్ని ప్రయోగించి తమ ఛందఃపరిజ్ఞానం ప్రకటించారు శ్రీనివాసరావుగారు. ఇందులోని కొన్ని పద్యాల్ని 'ద్రౌపదీవస్త్రాపహరణ' నాటకంలో సందర్భోచితంగా వాడుకొన్నారు. ఇట్లు శ్రీనివాసరావుగారు 'అగస్త్య బాల భారతం' తెనిగించి తమ సంస్కృతాంధ్ర భాషాపాండిత్యాలను విశదీకరించారు.

## ప్రపంచ నాటక చరిత్ర

ఆంధ్రీకృతాగస్త్య బాల భారతం తప్ప, శ్రీనివాసరావుగారి తక్కినవన్నీ వచనరచనలు. ఆధునికయుగంలో ఆంగ్లవిమర్శనా విధానం వంటిది తెలుగులో సైతం వెలిసింది. వచనరచనలు ఆరంభమయ్యాయి. శ్రీనివాసరావుగారు ఆంధ్రాంగ్లభాషలలో విమర్శనాత్మక రచనలు చేశారు. వీరు నాటకరచనా ప్రదర్శనలతో సంతృప్తిచెందక, నాటక లక్షణాలతోపాటు ప్రపంచనాటకచరిత్ర ఆంగ్లంలో రచించారు. అదే 'ప్రపంచనాటకచరిత్ర' (The Dramatic History of the World). వీరికి గల ఆంగ్లభాషాపరిజ్ఞానానికి, పాండిత్యప్రకర్షకు, విమర్శనాదక్షతకు ఈ ఉద్గ్రంథం పరమనిదర్శనం. స్వభాషాభిమానం గల వీరికి గ్రంథం ఆంగ్లంలో రచించడం అంతగా ఇష్టం లేదనవలసిఉంది. "with an earnest hope that my readers will excuse me for attempting to write this treatise in a foreign language, I humbly

conclude this preface.[1]" అయినా ఇందలివిషయం ప్రపంచ సంబంధి కావడ మేకాక, ప్రపంచప్రఖ్యాతిని గోరిన కోలాచలంవారు ఆంగ్లంలో రచించి ఉంటారని తలంచడమే సముచితం.

శ్రీనివాసరావు గారు 'ప్రపంచనాటకచరిత్ర' ను రెండు భాగాలుగా విభజించారు. ప్రథమభాగంలో ఏడు, ద్వితీయభాగంలో నాలుగు ప్రకరణాల గలవు. మొదటిభాగంలో యూరపుదేశాలకు సంబంధించినట్టి, ద్వితీయభాగంలో ఆసియాఖండంతోపాటు ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా దేశాలకు సంబంధించినట్టి నాటకచరిత్రల వివరణ కలదు. ఇందులో ప్రాచ్య, పాశ్చాత్యదేశాలలో నాటకం, నాటకరంగం పొందిన వికాసపరిణామాలను రావుగారు పరిశోధనాత్మకంగా పరిశీలించారు. పాశ్చాత్యదేశాలలో అన్నిటికంటె అతిప్రాచీనకాలం నుంచీ నాటకవాఙ్మయం గల గ్రీసుదేశంతో ఆరంభించి రోమ్, ఇటలీ, ఫ్రాన్స్, స్పెయిన్, పోర్చుగల్, గ్రేట్ బ్రిటన్, జర్మనీ, రష్యా, డెన్మార్కు, స్వీడన్, నార్వే, హాలెండు దేశాలలోని నాటకవికాసపరిణామాలను, ప్రాచ్యదేశాలలో అతిముఖ్యమూ, ప్రాచీనమూ అయిన భారతదేశంతో ఆరంభించి చైనా, జపాన్, అరేబియా, పర్షియా, టర్కీ, సిలోన్‌లలోని నాటకపద్ధతులేగాక ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికాలలోని నాటకరీతులను విపులంగా చర్చించారు.

ఉత్తమపరిశోధకునకు, విమర్శకాగ్రేసరునకుఉండవలసినలక్షణాలన్నీ శ్రీనివాసరావుగారిలో కలవనడానికి 'ప్రపంచనాటకచరిత్ర' ఉత్తమనిదర్శనం. ఆయావిషయాలను గూర్చి వివిధవిమర్శకుల అభిప్రాయాల్ని పొందుపరుస్తూ, తమ నిశ్చితాభిప్రాయాలను సైతం వివరించారు. ఇతర విమర్శకుల అభిప్రాయాలను అంగీకరించినప్పుడు ప్రశంసించడానికిగాని, ఏకీభవించని పట్టులలో తమ దృఢాభిప్రాయం-భిన్నమైనా-తెలపడానికి వెనుదీయలేదు. క్రీ. పూ. ౬వ. శ. నుంచిగల

1. The Dramatic History of the World-Preface-P 8.

గ్రీకునాటకకళ, నాటకరంగాలను గూర్చి విపులంగా చర్చించారు. గ్రీకునాటకావిర్భావవికాసాలను, గ్రీకునాటకకర్తలలో —ప్రధానంగా ట్రాజెడీలరచించిన Aeschylus, Sophocles, Euripides ల నాటకాలను, తరువాతి 'కామెడీ'లను గూర్చి విశదపరచారు. 'గ్రీకుట్రాజెడీ' లక్షణాలను, అరిస్టాటిల్ చెప్పిన ట్రాజెడీ లక్షణాలను వివరించారు. అతిప్రాచీనకాలంలోనే గ్రీకునాటకరంగం ముప్పైవేల ప్రేక్షకులు దర్శించడానికి అనువైనదిగా ఉండినట్లు **"The Athenian theatre was so large as to hold thirty - thousand people"** [2] అని పేర్కొన్నారు. అంటే ఆనాటి గ్రీకునాటకౌన్నత్యం ఎంతటిదో మనకు విదితమవుతుంది. నాటకారంభానికి మతమే ప్రధానకారణమని రావుగారు వివరించారు.

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఆంగ్లనాటకవాఙ్మయాన్ని, ఆంగ్లనాటకరంగాన్ని, నటులనుగూర్చి నిష్పక్షపాతబుద్ధితో చర్చించారు. ప్రసిద్ధాంగ్లనాటకకర్త షేక్స్పియరును, సమకాలికులనేగాక, తత్పూర్వం, తదనంతరం ఉండిన నాటకకర్తలను ఎలిజబెత్తురాణి మున్నగువారు నాటకరంగాన్ని ప్రోత్సహించి పోషించినవిధం, ఆంగ్లనాటకవిశిష్టతలను గూర్చి నిశితమైన విమర్శనాత్మకదృష్టితో విపులంగా వివరించారు. ఆనాటి ఆంగ్లనాటకరంగ ప్రసిద్ధి, ఔన్నత్యం, ప్రచారం మొదలైన సంగతులను రావుగారు కన్నులకుగట్టినట్లు చిత్రించారు.

పూర్వం భారతదేశంలోని నాటకాలఅభివృద్ధి, వాటిప్రాధాన్యం మొదలైన విషయాలను స్పష్టంగా చర్చించారు. భారతీయ నాటకకళ భారతదేశపు సొత్తు. గ్రీకులు, మహమ్మదీయులు మొదలైన విదేశీయులు మనదేశాన్ని ఆక్రమించి పరిపాలించినా, వారెవరూ ఈకళను కొనిరాలేదని సహేతుకంగా నిరూపించారు. మన నాట్యకళ ప్రాచీన

2. పైదే - పుట 17.

తకు, ప్రాధాన్యానికి ప్రబలతార్కాణం భరతమునికృత నాట్యశాస్త్రం. లక్ష్యముంటేనే లక్షణం ఉత్పత్తిల్లగలదన్న విషయం సర్వపండితజనైక వేద్యం. కనుక నాట్యశాస్త్రంవంటి ఉత్తమగ్రంథం వెలయడానికి ముందూ, సమకాలంలోనూ సంస్కృతంలో నాటకరచనా ప్రయోగాలు విరివిగా ఉండేవని స్పష్టం అవుతుంది. 'భరత' శబ్దం భావరాగ తాళసమ్మిశ్రితమని కోలాచలం వారు వివరించారు. ప్రాచీనకాలంలో మహాదౌన్నత్యం వహించిన సంస్కృతనాటకరంగం పతనంకావడానికి వీరు కారణాలను వివరించారు. మధ్యయుగంలో నాటకాలుగా రచింపబడిన 'తారాశశాంకం, బిల్హణీయం' మున్నగునవి ఉత్తమనీతి కథలు గావు. అట్టివే "కుమారరామచరిత్ర, సారంగధరచరిత్ర" మొదలైనవి. ఇలాంటి అవినీతి ప్రతిపాదకేతివృత్తాల్ని నాటకీకరించరాదని వీరి అభిమతం. నాటకం ఉత్తమనీతిబోధకమై ఉండాలన్నది వీరి సిద్ధాంతం. ఈ గ్రంథోపసంహారంలో కవిత్వం, సంగీతం మొదలైన లలితకళల సమాహారరూపం నాటకమనీ, సర్వోత్కృష్టమైన కళయేగాదు, జాతికి గర్వకారణం నాటకమనీ వివరించారు. మన నాటకరంగ సంస్కరణకై అనేక సూచనలు చేశారు. గ్రంథాంతంలో నాటకకర్తలు, నటులు, నాటకసమాజాలు, విమర్శకులు, ప్రేక్షకులు —అనుసరించదగిన అనేకాంశాలను పొందుపరచారు. వీటివల్ల తెలుగునాటకరంగానికి ఎంతో ఉపయోగం కలిగిందని శ్రీనివాసచక్రవర్తిగారు మిక్కిలి ప్రశంసించారు.[3] సద్విమర్శకులైన పురాణం సూరిశాస్త్రిగారు, నాటకకవులలో 'మార్గదర్శి, మహర్షి' అని కోలాచలంవారిని కొనియాడి ఉండడం పరిశీలనార్హం.[4] రావుగారు ఉత్తమ నాటకకర్తగానే కాక ప్రాచ్యపాశ్చాత్య నాటకలక్షణాలను, యుక్తులను గుర్తెరిగి సద్విమర్శకులుగా ప్రతిభావ్యుత్పత్తులను ప్రకటిస్తూ ఈ రచన చేసి

3. తెలుగు నాటక కవులు – పుటలు 49, 50.

4. నాట్యాంబుజము – పుట 281.

ప్రఖ్యాతిపొందారు. ఈ విషయాన్ని గూర్చి "ఇంతవరకును ఆధునికకాలమున తెలుగు కవులు నాటకప్రపంచమున చేసిన కృషి ప్రశస్తి తెలుగుసీమలను దాటిపోలేదన్నచో నతిశయోక్తి కాదు. శ్రీనివాసరావుగారి కట్టి భాగ్యము లభించినది; అది తెలుగువారి గర్వమునకు కారణమైనది."[5]అని ప్రస్తుతించిన డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారి మాటలు అక్షరాలా వాస్తవం.

## భగవద్గీతా విమర్శనోపన్యాసాలు

శ్రీనివాసరావుగారి ఆంగ్లమందలి విమర్శనకు 'ప్రపంచనాటక చరిత్ర' నిదర్శనం కాగా, తెలుగులోని విమర్శనకు వీరి ఉపన్యాసాలు ఉత్తమ తార్కాణ, రావుగారు బహుగ్రంథాలు పఠించి, పరిశోధించి నిగ్గుదేల్చి రచించిన వీ ఉపన్యాసాలు. ఇవి సభలలో ప్రసంగించిన ఉపన్యాసాలేఅయినా చక్కని వ్యాసాలు. వ్యాసంసైతం పందొమ్మిదో శతాబ్దిలో ఆంగ్లభాషా సాహిత్యాల ప్రభావంవల్ల కలిగిన ఫలితమే శ్రీనివాసరావుగారు భగవద్గీతాసంబంధి వ్యాసాలను సభలలో ప్రసంగించారు. తెలుగులో భగవద్గీతకు విపుల వ్యాఖ్యానాలు విరివిగా ఉన్నాయి. కాని విమర్శలు లేకపోవడంవల్ల ఆ లోపం తీర్చడానికి శ్రీనివాసరావుగారి భగవద్గీతా విమర్శనోపన్యాసాలు రచించినట్లు తెలియవచ్చింది. కానివీరు భగవద్గీతలోని అష్టాదశాధ్యాయాలకు విమర్శన రచించినట్లు కన్పట్టదు. మొత్తంమీద 12 ఉపన్యాసాలున్నాయి. గీతావిమర్శన కుపోద్ఘాతంగా 'భారత భగవద్గీతలను గురించిన విమర్శనము, 'వ్యవహారకర్మ జిజ్ఞాసము'- అనే రెండు ఉపన్యాసాలను రచించారు. 'భారత భగవద్గీతలను గురించిన విమర్శనము' అనే వ్యాసంలో వ్యాసకృత భారతంలోఆరంభంనుంచి భగవద్గీత లేదనీ, తరువాతికాలంలో ఇది చేర్చబడిందనీ వీరిందు ప్రతిపాదించారు. కాని బాలగంగాధర

---

౫. తెలుగు నాటక వికాసము – 2౬1.

తిలక్కుగారు మొదలగు పండితులు భగవద్గీత భారతంలో ప్రక్షిప్తమని అంగీకరించలేదు. 'వ్యవహారకర్మ జిజ్ఞాస' మనే ఉపన్యాసంలో అనేక గ్రంథాలలో చెప్పబడిన ధర్మాధర్మాలనుగూర్చి చర్చించారు.

"అర్జునవిషాదయోగము, సాంఖ్యయోగము, కర్మయోగము, జ్ఞానయోగము; కర్మసన్న్యాస మంత్రలయ హరరాజయోగములు, ధ్యానయోగము, జ్ఞానతారక బ్రహ్మయోగము, రాజవిద్యా రాజ గుహ్యావిభూతియోగములు, విశ్వరూపసందర్శన భక్తియోగములు, గుణత్రయ విచారము," అనేవి తక్కిన భగవద్గీతా విమర్శనోపన్యాసాలు. వీటిలో శ్రీనివాసరావుగారు వ్యాసానికుండవలసిన ఉపక్రమోప సంహారాలను పాటించడమేకాదు, వాటికి ఏకసూత్రత, పరస్పర సంబంధం సంఘటించి తమవిమర్శనాత్మక దృష్టిని ప్రకటించడం ప్రశంసార్హం.

## వేదవిమర్శనోపన్యాసాలు

శ్రీనివాసరావుగారి పాండిత్యప్రకర్షకు, మేధాసంపత్తికి, బహు గ్రంథ పరిచయానికి భగవద్గీతా విమర్శనోపన్యాసాల తరువాత పేర్కొదగినవి 'వేదవిమర్శనోపన్యాసాలు.' మొత్తం 15ఉపన్యాసాల్లో వేదార్థసారాన్ని చర్చించి వివరించారు. వేదం భారతీయులచరిత్ర అని తెలిపి ఆర్యుల నాగరికతాదులను అనేక దృష్టాంతాలతో వీరీఉపన్యాసాల్లో స్పష్టంచేశారు.

'ఆర్యులనాగరికత, వారి ప్రపంచవ్యాపకత' అనేది వేదవిమర్శనోపన్యాసాల్లో ప్రథమోపన్యాంసవంటిది. 'వేదమతము - నాస్తిక మతము-ఆర్యుల దైవములు. వేదవిచారవిమర్శము, సృష్టినిగురించిన తాత్పర్యము, వేదము చరిత్రయా ?, నరమేధ, అశ్వమేధాది యజ్ఞములు, వేదమతము-ఋగ్వేదము-పురాతనార్యులచరిత్రము (Rigveda-History of the Primitive Aryans), ఋగ్వేదములోని ముఖ్య

ప్రార్థనలు, మద్యపానము-జూదము - స్త్రీలగుణములు, వివాహకట్టడము, జాతి - వర్ణాశ్రమ ధర్మములు, మతవిధులేరీతిగఁ ప్రబలినది, ఋషులు, సప్తర్షులు-దధీచి-చ్యవనుఁడు, యమయమి- మృత్యువు - పితృదేవతలు-కర్మ" అనేవి ఇతర వేదవిమర్శనోపన్యాసాలు. ఇందులోని చివరి ఉపన్యాసం వేదవిమర్శనోపన్యాసాలకు ఉపసంహారోపన్యాసం వంటిది. క్రమంగా సాంఘిక దురాచారాలేవిధంగా ప్రబలిందీ శ్రీనివాస రావుగారు స్పష్టంగా వీటిలో వివరించారు.

శ్రీనివాసరావుగారు వేదాలను అనేక దృక్కోణాలనుంచి దర్శించి, సమగ్రపరిశీలనగావించి, పురాతనార్యుల వివిధవిషయాలను సోపపత్తికంగా స్థాపించారు. వాస్తవానికి వ్యాసాలన్నీ ఒకసిద్ధాంత వ్యాసం (thesis) లాగా ఒప్పారుతున్నాయి.

భగవద్గీతావేదాలనేగాక అనేక తదితరవిషయాలనుగూర్చి ఉపన్యాసాలురచించి సభలలో ప్రసంగించారు కోలాచలంవారు. వీటివల్ల రావుగారి వివిధవిషయపరిజ్ఞానం, సమన్వయబుద్ధి, తమఅభిప్రాయాల్ని స్పష్టంచేయగలనేర్పు విశదంకాక మానవు.

'గీతారహస్య' మనేగ్రంథంలో మహారాష్ట్రభాషలో బ్రహ్మశ్రీ బాలగంగాధరతిలక్కుగారు వ్రాసినదానికి తమసొంత అభిప్రాయాల్ని జోడించి, శ్రీనివాసరావుగారు 'మాయావాదోత్పత్తి క్రమము' అన్న ఉపన్యాసం రచించారు. 'ఆర్యవివాహము'- అన్న ఉపన్యాసం లోనివిషయం 'వివాహ కట్టడములు'- అనే ఉపన్యాసంలోనిదే. 'భారతీయ విద్యాభివృద్ధి, ప్రాచీనగ్రంథాలయచరిత్రము, భాసవిక్రమాదిత్యుల కాలనిర్ణయము'- అన్నవ్యాసాలు శ్రీనివాసరావుగారి పరిశోధనాత్మకదృష్టికి పరమనిదర్శనాలు. 'నాటకచరిత్ర' అన్నవ్యాసం ఆంధ్ర పత్రిక సంవత్సరాదిసంచిక (12-4-1911) లో ప్రకటించబడింది.

నాటకసంబంధి అనేక విషయాలను గూర్చి శ్రీనివాసరావుగారిందులో విపులంగా చర్చించారు. నాటకంలో పాటలు, పద్యాలు ఉండడం ఉచితమేనని, నాటకాలు నీతిబోధకాలై ఉండాలనీ వీరు వివరించారు.

1915 సం. ఏప్రిల్ 3, 4 తేదీలలో ఆంధ్రసాహిత్య పరిషచ్చతుర్థవార్షికోత్సవసభ బళ్ళారిలో జరిగినప్పుడు మూడుపన్యాసాలు శ్రీనివాసరావుగారిచ్చారు. ఇవి సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించబడ్డాయి. స్వాగతోపన్యాసంలో ఆంధ్రుల పురాతనచరిత్రను, రెండో ఉపన్యాసంలో 'ఆంధ్రనాటకము' లనుగూర్చి, మూడో ఉపన్యాసంలో 'ఆర్యులనాగరికత, వారిదేశాక్రమణము' అనే విషయాలను వివరించారు.

ఇంక శ్రీనివాసరావుగారి ఉపన్యాస చమత్కృతికీ, విమర్శనాత్మక బుద్ధి నైశిత్యానికీ, కీర్తిప్రతిష్ఠలకు కారణభూతమైన రెండు ఉపన్యాసాలుకలవు. అవి 1917 ఏప్రిల్ 7, 8 తేదీలలో కడపలో జరుపబడిన ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికసభకు అధ్యక్షులై వీరుగావించిన ఉపక్రమోప సంహారోపన్యాసాలు. ఇవి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించబడ్డాయి. ప్రారంభోపన్యాసంలో భాషాచరిత్రలకు సంబంధించిన విషయాలను విపులంగా చర్చించారు. భాషకుగల వృద్ధిక్షయాలు, భాషానిర్వచనం, దేశోన్నతి భాషోన్నతిపై ఆధారపడడం మొదలైన అనేకవిషయాలనుగూర్చి స్పష్టీకరించారు. ఇందులో రావుగారికిగల దేశాభిమానం, భాషాభిమానం అవగతమవుతున్నాయి.

వీరి ఉపసంహారోపన్యాసంలో వీరికిగల విమర్శనాత్మకజ్ఞానం, ఎదుటివ్యక్తుల మనస్సు నొప్పించక, తాము నొవ్వక వివేకంతో వ్యవహరించి సమన్వయించినపద్ధతి స్పష్టమవుతుంది. సభలో చదవబడిన

శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారి 'శ్రీనాథుని కవిత్వ' మనే ఉపన్యాసాన్ని వీరు శ్లాఘించి, శ్రీనాథుని శృంగారవర్ణనలవల్లనీతిబాహ్యుడనడానికి వీల్లేదని సమన్వయించారు. శ్రీవావిలికొలను సుబ్బారావుగారూ, నేరేళ్ళపల్లి రామకృష్ణశాస్త్రిలవారూ ఉపన్యసించిన పోతన విషయాలు ప్రశంసించదగినవని అభివర్ణించి, పోతన జన్మస్థలానికి సంబంధించిన వాదాలను వివరించారు. పోతన కడప మండలంలోని ఒంటిమిట్టవాడు అనడమే ఉచితమని అంగీకరించారు. మనుచరిత్రలోని 'ఇంతలు కన్నులుండ' పద్యముదాహరించి, దానిని వ్యాఖ్యానించి రావుగారు తమ ప్రతిభావ్యుత్పత్తులను ప్రకటించారు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చదివిన 'కవికర్ణ రసాయనము' గూర్చిన ఉపన్యాసంలోని రాళ్ళపల్లివారి విమర్శనాపద్ధతిని శ్లాఘించారు. శ్రీచింతలపల్లి నరసింహశాస్త్రిగారు 'కవిత్వతత్త్వము' ను గూర్చి చదవగా రావుగారు సమీక్షించారు చమత్కారంగా. ఇలాగా శ్రీనివాసరావుగారు తమ ఉపన్యాసనైపుణ్యాన్ని, విమర్శకదృష్టినీ, సమయస్ఫూర్తినీ ఈ ఉపన్యాసాలమూలంగా వెల్లడించారు.

పై పరిశీలనలో అగస్త్య బాలభారతాంధ్రీకరణతో శ్రీనివాసరావుగారి ఉభయభాషాపాండిత్యంస్పష్టమైంది. 'ప్రపంచ నాటకచరిత్ర' (The Dramatic History of the World) అనే ఆంగ్ల గ్రంథరచనవల్ల వారిఆంగ్లభాషాపాండిత్యమేగాక విమర్శనాత్మకదృష్టి విశదమవుతూంది. భగవద్గీతపై వెలిసిన శ్రీధరీయాదితొమ్మిది భాష్యాల సాయంతో పఠించి' భగవద్గీతాతత్త్వాన్ని ఉపన్యాసాలలో వివరించి, తమ ఆధ్యాత్మికచింతనను తెలిపి, ప్రజోపయోగార్థం ఆధ్యాత్మికతత్త్వం బోధించడం అవసరమని తమ ఆకాంక్షను ప్రకటించారు. వేదవిమర్శనోపన్యాసాల రచనచే శ్రీనివాసరావుగారికి గల వేదవేదాంతజ్ఞానం,పురాణ

కావ్యాదుల పరిచయం, చరిత్రపై గల ప్రత్యయం, వాటిని జనులకు వివరించాలన్న తపన, సంస్కృతభాషా సాహిత్యాలపరిజ్ఞానం, శాస్త్ర పాండిత్యం, వాటి సమన్వయం - మొదలైన గుణాలు అవగతమవుతు న్నాయి. తక్కిన ఉపన్యాసాల్లోను వీరిబుద్ధిసూక్ష్మత, విమర్శనాగుణం మొదలైనవి తెలుస్తున్నాయి. నాటకాలతోపాటు వచనరచనలు - ఉప న్యాసాలు (వ్యాసాలు) రచించి తమ ప్రత్యేకతను నిలబెట్టుకొన్నారు. ఇవన్నీ కోలాచలంవారి బహుముఖ ప్రతిభావిశేషాలకు పరమనిదర్శనం.

# సమకాలిక పరిస్థితులు

శ్రీనివాసరావుగారి నాటకాల వైశిష్ట్యంగురించి తెలుసుకోనేముందు ఆనాటి స్థితిగతులను ప్రస్తావించడంలో అసామంజస్యంలేదు. పైపెచ్చు శ్రీనివాసరావుగారి సమకాలిక పరిస్థితులవివరణవల్ల, వారే విధంగా నాటకకర్తగాను, ప్రయోక్తగాను మారి విజయం సాధించగలిగారో స్పష్టంఅవుతుంది. ఇంతకుముందే కోలాచలంవారి జీవిత సంగ్రహచరిత్రలో ప్రసక్తాను ప్రసక్తంగా కొంతవరకు ఆనాటి స్థితిగతులను ప్రస్తావించడం జరిగింది. తెలుగుసాహిత్యంలో ఎలాంటి వాతావరణంలో నాటకం ఆవిర్భవించి వికసించిందో కొంతవరకు క్లుప్తంగా చర్చించడంగూడ ఇందులో ప్రాధాన్యం వహిస్తుంది. శ్రీనివాసరావుగారి నాటకాల మౌళికతను అవగాహనచేసుకోడానికి మిక్కిలి ఉపకరించగలదు.

శ్రీనివాసరావుగారు 'సెకండుగ్రేడు ప్లీడరు' గా బళ్లారిలో 'ప్రాక్టీసు' చేయడానికి పూనుకొన్నాక, నాటకరచనా ప్రయోగాలకు అవకాశం కలిగింది; ఆ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని, విజయవంతం చేసుకోగలిగారు. ఆ సమయానికి సర్కారుజిల్లాలలోనే

గాక, స్వస్థలమైన బళ్ళారిపట్టణంలో సైతం నాటకరచనా ప్రయోగాలు కొనసాగుతూండేవి. మరోప్రక్క సంస్కృతాంగ్ల నాటక పఠన విమర్శలవల్ల శ్రీనివాసరావుగారిలోని సహజమైన ప్రతిభ వెలికురికి కార్యరూపం పొందడానికి ఉరకలు వేసిందని చెప్పవచ్చు.

తెలుగులో నాటకరచన చాలా ఆలస్యంగా ప్రారంభమైంది. ఆంధ్రవాఙ్మయం నన్నయతో ఆరంభమైనా, ఆధునికయుగంలో మాత్రమే నాటకరచన చేయబడింది. అంతమాత్రంచేత ఆంధ్రులు నాట్యకళ, నాటకాలగురించి ఎరుగరని తలంచరాదు. తెలుగులో కవిత్రయకాలంలో కేవలం పురాణాలుమాత్రమే అనువదించబడడం జరిగింది. ఆ తరువాత శ్రీనాథయుగంలో కావ్యపరివర్తనంతోపాటు నాటకానువాదంగూడ ప్రారంభమైంది. ఇది సహజపరిణామమనే తలంచాలి. శ్రీనాథుని సమకాలికులుకొందరు ప్రసిద్ధ సంస్కృతనాటకాల్ని కొన్నింటిని ప్రబంధఫక్కికలో ఆంధ్రీకరించారు. శ్రీనాథకృతమని విమర్శకు లంగీకరించిన 'క్రీడాభిరామము' వీథీరూపంలో కలదు. వీథి దశవిధరూపకాల్లో ఒకటి. త్రిపురాంతకకృత సంస్కృత 'ప్రేమాభిరామము' దీనికి మూలం. కాని తెలుగున మార్గరూపకాలవంటివి వెలయలేదు.

పందొమ్మిదోశతాబ్దివరకు తెలుగున నాటకరచన జరగకపోవడానికి పలువురు పలుతెరగుల ఊహిస్తున్నారు. ఆ నాడు శ్రవ్యకావ్యాలకేగాని. దృశ్యకావ్యాలకు ప్రాధాన్యంలేకపోవడంవల్ల నాటకరచనకు నాటికవులు ప్రయత్నించలేదని కొందరూ, సంఘంలో నటులకు గౌరవంలేకపోవడంవల్ల రచించబడలేదని మరికొందరూ, మార్గనాటకపద్ధతిలో నాటకాలురచిస్తే, పాత్రోచిత భాషాప్రయోగంలో గ్రామ్యభాష వాడవలసివస్తుందనీ, అది లక్షణవిరుద్ధం కావడంవల్ల పూర్వులు నాటకరచనకు పూనుకోలేదని ఇంకకొందరు, ఆనాడు తగిన రంగస్థలాలు లేకపోవడంవల్లా, తెలుగులో నాటకోచితవచన రచన, నాటకలక్షణం లేకపోవడంవల్లా నాటకాలు రచించబడలేదని

వేరొకకొందరూ - ఈ విధంగా ఉపపత్తులను జూపయత్నించారు. కాని ఇవి అంత సంతృప్తికరమైన సమాధానాలుగా కనిపించడంలేదు. అప్పటికే బహుళప్రచారంపొందింది. పండితులకు ఆస్వాదయోగ్యాలుగా ఉండేవి సంస్కృతరూపకాలు. పామరప్రజానీకానికి జానపద కళాఖండాలైన తోలుబొమ్మలాటలు, వీథిభాగవతాలు, యక్షగానాలు మొదలైనవి అందుబాటులో ఉండి నాటకాలు లేని లోపాన్ని తీరుస్తూఉండేవని మనం తలంచవచ్చు. ఇలాంటి ఆటలనుగూర్చి వర్ణించిన పాల్కురికి సోమనాథుని మాటలే పై అభిప్రాయానికి చక్కని నిదర్శనం.[1] కనుకనే తెలుగుకవులు పందొమ్మిదో శతాబ్దివరకు నాటకరచనకు పూనికొని ఉండరని ఊహించడమే సముచితం.

## ఆంగ్ల నాటక ప్రభావం

పాశ్చాత్య, పార్సీ నాటకరంగ ప్రభావంచేతనైతేనేమి, మనలో కలిగిన సాంస్కృతిక, రాజకీయచైతన్యంవల్లనైతేనేమి పందొమ్మిదో శతాబ్దిలో తెలుగులో నాటకరచనా ప్రయోగాలు ఆరంభమయ్యాయి. భారతదేశంలో తాము అధికారం సంపాదించుకొన్నాక, సుస్థిరతకై ఆంగ్లభాషాబోధనప్రవేశపెట్టారు ఆంగ్లేయులు. ఉద్యోగసము పార్జనకుగాని, సంఘంలో గౌరవంపెంపొందించుకోడానికిగాని ఆంగ్లభాషను అభ్యసించడానికి పూనుకొన్నారు భారతీయులు. ఒకవంక ఆంగ్లభాషాభ్యాసం అధికం కావడంవల్లా, మరోప్రక్క ఆంగ్లవాఙ్మయంలోని రసవన్నాటకాల పఠనప్రయోగాల మూలకంగా బహుళవ్యాప్తి చెందడంవల్లా, మనవారిలోనైతం తెలుగులో నాటకాలు రచించాలన్న ఆకాంక్ష కలిగింది.

1. బసవపురాణము— పుట 124; పండితారాధ్యచరిత్రము - పర్వత ప్రకరణము.

భారతదేశంలో 'ఈస్టిండియాకంపెనీ' స్థాపనతో ఆంగ్లేయులు, ఆంగ్లవర్తకులు తమవినోదంకోసం పాశ్చాత్య నాటకరంగాన్ని మన దేశంలో ప్రవేశపెట్టడం జరిగింది. మొదట మనదేశంలోని ముఖ్యపట్టణాలైన కలకత్తా, బొంబాయి, మద్రాసు మొదలైనవాటిలో సొంతంగా ఆంగ్ల నాటకాలను ప్రదర్శించేవారు. 1757 కు ముందే కలకత్తాలో అంగ్లనాటకరంగం ఉండేది. తరువాత బొంబాయి, మద్రాసులలోగూడ క్రమంగా వెలిశాయి.[2] వీటిలో ఆంగ్లనాటకాలనుగాని, సంస్కృత రూపకాలనుగాని, లేదా వాటి అనువాదాల్నో, అనుసరణల్నో ప్రదర్శించడానికి పూనుకొన్నారు. మనదేశానికి ఉద్యోగనిమిత్తమై వచ్చిన ఆంగ్లభాషాచార్యులు కళాశాలల్లో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడిన షేక్స్పియర్ మొదలైనవారి నాటకాల్ని తమ విద్యార్థులచే ప్రదర్శింపజేస్తూ ఉండేవారు. ఇట్టి ప్రదర్శనలు కలకత్తా, బొంబాయి, పూనా పట్టణాల్లోనే గాక ఆంధ్రదేశంలోసైతం ఆ రోజుల్లో సామాన్యమే. ఈ విధంగా ఆంగ్లాధ్యాపకులు కళాశాల, విశ్వవిద్యాలయాలలోని విద్యార్థుల నాట్యకళా నైపుణ్యాన్ని ప్రోత్సహిస్తూ ఉండేవారని స్పష్టమవుతుంది.[3]

ఇంతేగాక పందొమ్మిదోశతాబ్దివరకు నటుడన్న సంఘంలో గౌరవంలేదు. అందుకే తక్కువ కులాలవారు మాత్రమే వీథినాటకాల్లోను, బొమ్మలాటల్లోను పాల్గొంటూఉండేవారు. కాని ఆంగ్లవిద్యావంతులైన ఉన్నతాధికారులు, ప్రసిద్ధవ్యక్తులు నాటకాల్లో వివిధ పాత్రలు ధరించడం ప్రారంభించాక చాలామార్పు వచ్చింది. ఆంగ్ల వాఙ్మయంవల్లా, పాశ్చాత్యనాగరికతవల్లా మనదేశంలోనూ నాటకా

---

2. Sri R. K. Yajnik : 'The Indian theatre' P 83, 91, 99.

3. (i) వైదే- పుటలు 86, 98, 94.

(ii) చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి 'స్వీయచరిత్ర' – పుట 60.

నికి, నాటకరంగానికి, నటనకు ఎక్కడాలేని గౌరవాదరాలు కలిగాయి.

## పార్శీనాటకరంగ ప్రభావం

మొదట ఆంగ్లనాటకరంగ ప్రభావం పార్శీ, మహారాష్ట్ర నాటకరంగాలపై బడింది. తరువాత వీరిమూలంగా మన ఆంధ్రనాటక రంగం ప్రభావితమైంది. కనుక తెలుగుపై ఆంగ్లనాటకరంగ ప్రభావం పరోక్షమైనది. పార్శీనాటకరంగం అనుకూలంగా ఆంగ్లనాటకరంగ లక్షణాల్ని తన సొంతం చేసుకొంది. కాని పార్శీలు నాటకప్రదర్శనలను మనోరంజకం చేయడానికి ఎక్కువగానే ధనం వెచ్చించేవారు. వివిధ విధాలుగా రంగాలంకరణగావించి, చక్షుఃప్రీతితోపాటు మనస్సుకు ఆశ్చర్యంగొల్పేట్లు చేసేవారు. [4]

భారతదేశంలో ఈ పార్శీ నాటకరంగ ప్రభావంతో అనేక నాటకరంగాలు వెలిశాయి. సాంగ్లీ ప్రభువు ఆదేశానుసారం 1843 లో 'సీతాస్వయంవరం' అనేనాటకం మరాఠీలోరచించి ప్రదర్శించారు, విష్ణుదాసుభావే. ఇదే మరాఠీనాటక రచనాప్రదర్శనలకు ఆరంభం. పార్శీనాటకరంగ ప్రభావంవల్ల క్రమంగా మహారాష్ట్రనాటకరంగం మిక్కిలి అభివృద్ధిచెందింది. ఇట్లే ఉర్దూ, గుజరాతీరంగాలు వెలిశాయి.

---

4. (i) 'The Dramatic History of the World'-P. 232,233.
(ii) Prof. G. N. Reddy, M. A., M. Litt., Ph. D :- 'The Influence of English on Telugu Literature" (Unpublished)- p 124.
(iii) 'The Indian Theatre'- p 90, 96,
(iv) శ్రీ యం. ఆర్. శాస్త్రి :- 'పారశీరంగభూమి' - నాట్యకళ - డిశంబరు 1964-పుట 28.

సంచారంచేయడంలో ఆసక్తిగల ఫార్సీ, మహారాష్ట్ర నాటక సమాజాలు భారతదేశంలో పలుచోట్లతిరిగి ప్రదర్శనలు ఇచ్చాయి. 1855, 1876-77 ప్రాంతంలో పై రెండు సమాజాలు ఉత్తర కర్ణాటక, మైసూరు, ఆంధ్రదేశాలలో సంచారంచేసి విజయవంతంగా ప్రదర్శనలిచ్చి, తమ ముద్రవేశాయి. వీటిప్రభావంతో 1877 లో ఉత్తర కర్ణాటకంలో గదగ్‌లో కన్నడనాటకసమాజం ప్రప్రథమంగా వెలిసింది. ఇంకా అనేక సమాజాలు కర్ణాటకంలో అభివృద్ధిలోకి వచ్చాయి. ఫార్సీ, మహారాష్ట్ర నాటకసమాజాల ప్రభావంతో కన్నడదేశంలో నాటకసమాజాలు స్థాపించబడినట్లు స్పష్టం. [5]

## తెలుగు నాటకారంభం

ఉత్తరకర్ణాటకంనుంచి కొన్ని కన్నడ నాటకసమాజాలు బళ్లారి, మంగళూరులకు సంచారంచేసి ప్రదర్శనలివ్వడం ఆరంభించాయి. అది 1877-80 మధ్యకాలంలో జరిగింది. అంటే బళ్ళారిలో మరాఠీ హిందీనాటకాలతోపాటు కన్నడభాషానాటకాలునైతం ప్రదర్శించబడుతూ వచ్చాయి. ఆనాడు నాటకోచితభాష కన్నడమనీ, తెలుగందుకుపకరించదనీ ఒక అభిప్రాయముండేది. కాని అట్టి అపోహను పోగొట్టడానికి ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు తెలుగులో 'చిత్రనళీయ' నాటకం గద్యపద్య గేయాత్మకంగా స్వతంత్ర నాటకం రచించి, 1886 లో ప్రదర్శించి ప్రసిద్ధిపొందారు. కాని వీరు గూడ ఆరంభంలో కన్నడంలో 'స్వప్నానిరుద్ధ' మనేనాటకంరచించి

---

5. (i) 'The Indian Theatre' - p. 96, 97.
(ii) Dr. H. K. Ranganath - 'The Karnatak Theatre' - p. 79, 81, 82, 123.

ప్రజల మన్ననలకు పాత్రులయ్యారు.[6] కొన్ని సంచారనాటక సమాజాలతోపాటు 'బాలగంధర్వ, కేశవగంధర్వ' మొదలైన నాటకసమాజాలు పూనా, ధార్వాడలనుంచి నాటకసమాజాలు ఆంధ్రదేశమంతటా సంచారంచేసి ప్రదర్శనలిచ్చి, ఆంధ్రప్రజల్లో నాటక పునరుజ్జీవనాభిరుచిని కలిగించాయి. 'కేశవగంధర్వ, బాలగంధర్వ' అనే రెండు 'నాటకకంపెనీలు' బళ్ళారిలో ఇచ్చిన ప్రదర్శనలతో ప్రభావితులైన శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు రెండు మరాఠీ నాటకాలను అనువదించడం జరిగింది.[7]

ఇది ఇలా ఉండగా ఉత్తర సర్కారులలోను నాటక రచనా ప్రయోగాలు ఆరంభమయ్యాయి. 1880 లో 'పూనా సాంగ్లీ నాటక సమాజం', 'ధార్వాడనాటక సమాజం' వారు ఆంధ్రదేశంలోను, మద్రాసులోను పర్యటించి విజయవంతంగా ప్రదర్శనలిచ్చారు. ఆంధ్రదేశంలో ముఖ్యపట్టణాలన్నిట ఈ ప్రదర్శనలివ్వడం జరిగింది. 1880 లో ధార్వాడనాటక సమాజంవారు రాజమండ్రివచ్చి నాటకాలాడిన తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు మిత్రుల ప్రోత్సాహంతో శ్రీ హర్షరచిత 'రత్నావళీ' నాటికను, షేక్స్పియర్ 'కామెడీఆఫ్ఎర్రర్సు'ను 'చమత్కార రత్నావళి' అనే నాటకంగాను తెనిగించి ప్రదర్శించారు. దీనికి కాస్త ముందే వీరి 'వ్యవహార ధర్మబోధిని' అనే నాటకాన్ని విద్యార్థులు విజయనగరం బాలికా పాఠశాలలో ప్రదర్శించారు. మొత్తం ఆంధ్రదేశంలోనే ఇది ప్రథమ ప్రదర్శన.[8] 1885 లో వామన భట్టజోషి అనే మహారాష్ట్రుడు ఏలూరులో నాటక సమాజం ఏర్పాటు చేశాడు. 'ఏలూరునాటక

---

6. ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి 'చిత్రనళీయ' నాటక పీఠిక.
7. కోలాచలం శ్రీనివాసరావుగారి "మానాపమాన నాటక" పీఠిక.
8. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'స్వీయచరిత్ర' - ద్వితీయ భాగము-పుట 178.

కంపెనీ' అని దానిపేరు. ధార్వాడనాటక సమాజం వారిలాగే హిందీ నాటకాలాడేవారు.[9] ధార్వాడనాటక సమాజాలవంటివే రేపల్లె, బందరు మొదలైన పట్టణాల్లోను వెలిశాయి. వీరుకూడ హిందీలోనూ నాటకాలాడేవారు. 1885 లో పూ.నా నాటక సమాజం ఆంధ్రదేశం అంతటా పర్యటించి హిందీ, మరాఠీ నాటకప్రదర్శనలు విరివిగా ఇచ్చాక తెలుగున సంస్కృతాంగ్ల పరివర్తనంతో పాటు స్వతంత్ర నాటక రచనలు అనేకం వెలిశాయి; ప్రదర్శనలు ఆరంభమయ్యాయి.

1860 లోనే తెలుగులో స్వతంత్రనాటకం వెలసింది. అదే 'మంజరీ మధుకరీయము'. దానికర్త కోరాడ రామచంద్రశాస్త్రిగారు. కాని ఇందలి భాష శ్రవ్యకావ్యోచితంగా ఉంది; కవిపాండిత్య ప్రకర్షను వ్యక్తం చేస్తూంది. ఇది ప్రదర్శితమైనట్లులేదు. 1872 సం. లో 'నరకాసుర విజయవ్యాయోగాన్ని' శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు సంస్కృతంలో నుంచి అనువదించారు. కాని 1870లో ప్రప్రథమంగా శాకుంతలాన్ని ఎమ్. శేషాచార్యులు గారు అనువదించినట్లు తెలియవస్తూంది 1875 లో పరవస్తు వేంకటరంగాచార్యులుగారు శాకుంతలాన్ని కొంతవరకు తెనిగించారు. కాని ఆ తరువాతి సంవత్సరంలో ఆరంభించి 1883 నాటికి శాకుంతలానువాదం కందుకూరివారు పూర్తిచేశారు. సంస్కృతానువాదాలీవిధంగా వస్తూండగా 'జూలియస్ సీజర్' నాటకాన్ని పద్యాత్మకంగా అనువదించారు వావిలాల వాసుదేవశాస్త్రిగారు. వీరు 1880 లో స్వతంత్ర సాంఘిక నాటకం 'నందకరాజ్యము' రచించారు. కొన్ని సంస్కృత నాటకానువాదాలు గూడ చేశారు. 1880 కందుకూరివారి అనువాద నాటకాలతోనే ఆంధ్రదేశంలో నాటకప్రదర్శన ప్రారంభమైనదన్న విషయం పూర్వోక్తం. కందుకూరివారు సంస్కృతాంగ్ల రూపక

9. చిలకమర్తి 'స్వీయచరిత్ర'- పుట 86.

పరివర్తనలనే గాక స్వతంత్రనాటకాలు సైతం రచించారు. 1880 లో గురజాడ శ్రీరామమూర్తిగారు 'మర్చెంట్ ఆఫ్ వెనిస్' నాటకాన్ని 'వెనీసు వణిజనాటకము' లేక 'సుహృత్సుభాషిత' మనే పేరుతో అనువదించారు. 1880–84 మధ్యకాలంలో కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు దాదాపు 31 నాటకాలు రచించినా, ప్రకటితమై లభించింది ఒక 'వస్త్రాపహరణ' నాటకం మాత్రమే. వీరినాటకాలన్నీ చాలవరకు వచనంలోనే ఉండేవి. వీరేగాక ఆ రోజులలోని నాటక కర్తలందరూ చాలవరకు వచనంలోనే రచించారు. క్రమంగా పద్యాలు చేరాయి. 1883 లో వడ్డాది సుబ్బారాయుడుగారు 'వేణీసంహార' నాటకం ఆంధ్రీకరించారు. నాదెళ్ల పురుషోత్తమ కవిగారు గూడ 1884 నుంచి 32 హిందూస్థానీ నాటకాలు, పది తెలుగు నాటకాలు రచించారు. బందరు 'నేషనల్ థియేట్రికల్ సొసైటీ' వారి కోసం వీరు నాటకాలు రచించేవారు.

ఈ విధంగా ఉత్తరసర్కారులలో ఆంధ్రనాటక రచనాప్రయోగాలు వికాసం చెందుతూండగా, రాయలసీమలో ధర్మవరంవారు వచనంతోపాటు పాటలు, పద్యాలు చేర్చి నాటకరచన చేయడం ఆరంభించి ప్రదర్శనలిస్తూ వచ్చారని ముందే స్పష్టం చేయబడింది. బళ్లారిలో 'సరసవినోదినీసభా' నాటక సమాజవ్యవస్థాపకులు వీరే. 'చిత్రనళీయం' ప్రథమాంధ్ర స్వతంత్రనాటకం. 'విషాదసారంగధర నాటకం' రచించి తెలుగులో విషాదాంతనాటకాల్ని ప్రవేశపెట్టిన ఘనతను వీరు సంపాదించుకొన్నారు. వీరికిగల 'ఆంధ్రనాటక పితామహు' డన్న బిరుదం చాల సార్థకమైనది.

1889 లో ఇమ్మానేని హనుమంతరావుగారు రాజమండ్రిలో 'హిందూనాటక సమాజం' స్థాపించి, చిలకమర్తివారిచే 'కీచకవధ' నాటకం వ్రాయించి ప్రదర్శించారు. అది కేవలం వచననాటకం.

తరువాత పద్యాలు చేర్చబడ్డాయి. 'గయోపాఖ్యానం' మొదలైన స్వతంత్ర నాటకాలు రచించడమే గాక, 'కర్ణభారం' తప్ప భాస నాటక చక్రాన్ని చిలకమర్తివారు తెనిగించి ప్రసిద్ధికెక్కారు.

## కోలాచలం వారు

ఇట్లు ఆంధ్రదేశంలోను, స్వస్థలమైన బళ్ళారిలోను నాటక రచనా ప్రదర్శనలు ప్రారంభమైన దశలో కోలాచలం శ్రీనివాసరావు గారు నాటకకర్తగా వెలుగులోకి రావడం జరిగింది. బళ్లారిలో 'సరస వినోదినీసభా' నాటకసమాజానికి పోటీగా 'సుమనోరమసభా' నాటక సమాజం స్థాపించబడింది. దీనికధ్యక్షులు కోలాచలంవారు. వీరు నాటకకర్తగా, ప్రయోక్తగా ఉండడంవల్ల 'సుమనోరమసభా' నాటక సమాజం బళ్లారి రాఘవ మొదలైన ప్రసిద్ధ నటులతో అచిరకాలంలోనే చాల ప్రసిద్ధికెక్కింది. శ్రీనివాసరావుగారు 'సునందనీపరిణ' యాది నాటకాలు ఇరవై ఎనిమిది రచించారు. వీరి చారిత్రక నాటకాలన్నిటికి తలమానికం వీరి 'రామరాజుచరిత్రము' లేక 'విజయనగరవినాశము' **(The Fall of Vijayanagar)** పౌరాణికాలమీదే ప్రజలకెక్కువ మోజు న్నప్పటికీ, ప్రజలకు చరిత్రాంశాలు తెలియజేయాలన్న ఆకాంక్షతో చారిత్రక నాటకాలను ఎక్కువగా రచించిన ప్రత్యేకత రావుగారిలో కలదు. వీరి నాటకాలు ధర్మవరంవారి నాటకాల్లాగే గద్యపద్య గేయాత్మకమై ఉన్నాయి. పార్శీనాటకాల్లోని పాటల పద్ధతినే గాక వీథినాటకాలు, బయలాటలు, యక్షగానాలు మొదలైనవాటిలోని దరువులు, పదాలు, గేయాలవంటి వాటిని సైతం చూసిన వీరు, పామరప్రజల ప్రీత్యర్థం పాటలను ప్రవేశపెట్టారు. అందుచేత వీరి నాటకాలు పండిత పామరులకు సమంగా ఆస్వాదయోగ్యంగా ఉండి ప్రసిద్ధికి వచ్చాయి. భారతరామాయణాలను దాదాపు నాటకాలుగా మొదటిసారిగా రచించిన ఘనత రావుగారికే దక్కింది. అత్యధిక

సంఖ్యలో చారిత్రక నాటకాలు రచించి "ఆంధ్రచారిత్రక నాటకపితామహు"డన్న ప్రతీతికి పాత్రులయ్యారు. 'రామరాజు చరిత్ర' మొదలైన నాటకాలలో విషాదాంత నాటకలక్షణాలు శ్రీనివాసరావుగారి పాశ్చాత్య నాటకలక్షణాల పరిచయానికి పరాకాష్ఠ. ప్రాచ్యపాశ్చాత్య నాటకలక్షణాలను, నాటకాలను పఠించి, వాటిని ఒక గ్రంథరూపంలో వెలయించినవారు వీరే. అదేవారి 'ప్రపంచనాటకచరిత్ర' (The Dramatic History of the World) అన్న ఆంగ్లగ్రంథం. ఇట్టిది మన ఆంధ్రదేశంలోనేగాదు మొత్తం భారతదేశంలోనే ప్రప్రథమ ప్రయత్నం. మొట్టమొదటిసారిగా బళ్ళారిలో వాణీవిలాస నాటకశాలను నిర్మించిన కీర్తిగూడ శ్రీనివాసరావుగారికి దక్కింది. వీటివల్ల ఆంధ్రనాటక కర్తలందరిలోకంటె శ్రీనివాసరావుగారిలో గల ప్రత్యేకత, విశిష్టతలు స్పష్టం అవుతున్నాయి. వీరు తెలుగునాటక రంగానికి, నాటకానికి చేసినసేవ అనన్య సామాన్యమూ, అనితర సాధ్యమూ అంటే అతిశయోక్తికాదు; స్వభావోక్తి!

## ఇతర నాటక కర్తలు

1897 సం. ఆంధ్రనాటకరంగంలో విశిష్టమైంది. ఇదే సంవత్సరంలో వేదం వేంకటరాయశాస్త్రి గారు 'ప్రతాపరుద్రీయం' గురజాడ వేంకటఅప్పారావుగారు 'కన్యాశుల్కం' అనే స్వతంత్ర నాటకాలు వెలయించారు. వీటి ప్రకటనతో ఆంధ్రదేశంలో అలజడి బయలుదేరి, తర్జన భర్జనలు జరిగాయి. వ్యావహారిక భాషకు 'కన్యాశుల్కం' ప్రతినిధి కాగా, పాత్రోచితభాషకు 'ప్రతాపరుద్రీయం' ప్రాతినిధ్యం వహించింది. కాని శ్రీనివాసరావుగారు వ్యావహారిక భాషకుగాని, పాత్రోచిత భాషకుగాని ప్రాముఖ్యం ఇవ్వలేదు. పైగా గ్రాంథిక భాషలోనే గ్రంథాలు వ్రాయాలన్నది వారి ఆశయం. తదుచితంగానే వారు నాటక రచన గావించారు.

ఒక ప్రక్క వ్యావహారిక భాషావాదం, మరొక ప్రక్క పాత్రో చిత భాషా సిద్ధాంతం విరివిగా కొనసాగుతున్న రోజులలో గ్రాంథిక వ్యావహారిక భాషలను రెంటిని సమన్వయించడానికో అన్నట్లు సులభ మైన, లలితమైన భాషలో నాటకరచన గావించి ప్రసిద్ధికెక్కినవారు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. నాటకాల్లో వృత్తాలను వాడ గూడదనీ, చదవడానికి అనుకూలమైన ఆటవెలది, తేటగీతి మొద లైన జాతులనే ఉపయోగించాలని వీరివాదం. వీరు క్రమంగా కేవల వచన నాటకాలే వ్రాశారు. సహజహాస్య ప్రియులు కావడంవల్ల వీరి నాటకాలన్నిట హాస్యముంది. హాస్యానికి బలం చేకూర్చినవారు వేదంవారు, గురజాడవారు అనడంలో సందేహంలేదు. 31 నాటకాలు రచించిన శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రిగారు పాత్రోచిత భాషా వాదులు. నాటక పద్యానికి అధికప్రాముఖ్యం ఇచ్చినవారు తిరుపతి వేంకటకవులు. తమ పద్యరచనా పాటవాన్ని ఆంధ్రులకు రుచిచూపి ఖ్యాతివహించారు. వీరి భారతనాటకాలు ప్రసిద్ధికెక్కాయి. కాని పద్యంమీది వ్యామోహంతో ఈ రోజులలో నాటకంలోని కార్యం (action) కంటె పద్య పఠనానికే ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతూంది. అయినా ఈనాటికీ ఆడబడుతూన్న పౌరాణిక నాటకాలు తిరుపతి వేంకటకవులవే అంటే వాటి గొప్పదనం స్పష్టం కాకమానదు. ఇచట పేర్కొదగిన నాటకకర్త బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు. వీరి 'హరి శ్చంద్ర' చాల ప్రచారం పొందిన నాటకం. తదనంతరం సంఘసంస్క రణ ప్రధానాశయంగా గ్రహించబడి నాటకరచన సాగింది. అట్టి వారిలో పేర్కొదగిన వారిలో కాళ్లకూరి నారాయణ రావుగారు, సోమరాజు రామానుజరావుగారు ముఖ్యులు. మరోప్రక్క జాతీ యోద్యమ ప్రభావంతో నాటకరచన కొనసాగింది. ఇట్లు తెలుగు నాటకరంగంలో అనేకమైన మార్పులు రాసాగాయి.

## నాటి పరిస్థితులు

ఆంధ్రదేశమంతటా నాటక సమాజాలు కోకొల్లలుగా వెలిశాయి. ప్రజలకు నాటకవినోదం ఒక ముఖ్యమైనదిగా పరిణమించింది. ఈ కాలంలోని నాటకాలలో రచనా వైవిధ్యం సైతం గోచరిస్తుంది. వంగ, మరాఠీ, సంస్కృతాంగ్ల భాషా నాటక పరివర్తనలతో పాటు అనేక స్వతంత్రనాటకాలు తెలుగులో రచితమయ్యాయి. స్వతంత్రనాటకాల్లో పౌరాణికాలు, చారిత్రకాలు, సాంఘికాలు అని వివిధ విధాలుగా వెలిశాయి. ప్రయోగ సౌలభ్యార్థం రచనలో మార్పులు వచ్చాయి. బందరులో నాటకపు పోటీలు, విమర్శలు ప్రారంభమయ్యాయి. ఆంధ్రనాటక కళాపరిషత్తును స్థాపించి, అనేక నాటకకర్తలను, విమర్శకులను రాపించి, పురాణం సూరిశాస్త్రి గారు పోటీలను, విమర్శలను నిర్వహించారు. సమకాలిక పత్రికలైన అముద్రిత గ్రంథ చింతామణి, చింతామణి, శశిరేఖ మొదలైన వాటిలో నాటక సంబంధివిమర్శ, ప్రతివిమర్శలు గావించడం ఆరంభమైంది. తెలుగునాటకాన్ని, నాటకరంగాన్ని సంస్కరించవలసిన ఆవశ్యకాన్ని అనేకులు వ్యక్తం చేశారు. ఇదే సమయంలోనే నటవతంసులైన బళ్లారి రాఘవ, నెల్లూరి నగరాజారావు మొదలైన వారు ప్రసిద్ధికెక్కారు. నాటకరచనా ప్రదర్శనలపై విద్వాంసులలో విమర్శనా లేశం ప్రబలింది. ఇట్లు ఆంధ్రనాటక రచనా ప్రయోగాలు దినదినాభివృద్ధి చెందడం స్పష్టమవుతుంది.

ఆంగ్ల, పార్శీ నాటకరంగ ప్రభావంతో పందొమ్మిదో శతాబ్దిలో ఆరంభమైన ఆంధ్రనాటకరచనా ప్రయోగాలు అచిరకాలంలోనే

వికాసం చెందాయి. ఈ కాలంలోనే కోలాచలం శ్రీనివాసరావుగారు ఎంతో వైవిధ్యంతో కూడిన ఇరవై ఎనిమిది నాటకాలు రచించి, నాటకకర్తగా, ప్రయోక్తగా తమ వైశిష్ట్యమునూ, ప్రత్యేకతనూ నిలబెట్టుకొన్నారు. ఆనాటి వాతావరణం నాటకరచనా ప్రయోగాలకు శ్రీనివాసరావుగారికెలా ఉపకరించిందో స్పష్టం కావించడానికే ఇంత వివరణ చేయవలసి వచ్చింది.

# కోలాచలంవారి నాటకాలు

నాటకీయశిల్పం, రచనాశిల్పం, రచనా ప్రయోజనం—అనే అంశాల్ని చర్చించి, హాస్యపోషణ విధానం, విషాదాంత నాటక రచనా పద్ధతి, 'ఆంధ్రచారిత్రక నాటక పితామహు' డన్న ప్రతీతి సామంజస్యం వివరించి చూపడంవల్ల శ్రీనివాసరావుగారి నాటకాల మౌళికత (originality), తన్మూలంగా వైశిష్ట్యమూ విశదం కాగలవు. ఆ ప్రయత్నమే ప్రస్తుత ప్రసక్త విషయం.

ఇతివృత్త నిర్మాణ దక్షత, సన్నివేశకల్పనా సామర్థ్యం, పాత్రచిత్రణా చణత్వం—అనే అంశాలు విశదంచేస్తే నాటకీయశిల్పం అవగతమవుతుంది. శ్రీనివాసరావుగారిలోని నాటకీయ యుక్తులు, శిల్పరామణీయకం స్పష్టం చేయడం ఇందులోని ముఖ్య విషయం.

## ఇతివృత్త నిర్మాణ దక్షత

ఆధునిక యుగంలో ఆంధ్రనాటక రచనా ప్రయోగాల తొలి రోజులలో, నాటక రచనకు పూనుకొన్నారు శ్రీనివాసరావుగారు. దాదాపు నలభై సంవత్సరాల ప్రౌఢవయఃపరిపాకంలో నాటకరచన కుపక్రమించడం వల్లనే, వారి ప్రతిభకు, భారతీయ పాశ్చాత్య కావ్య

నాటక పఠనంవల్ల, విమర్శనవల్ల కలిగిన వ్యుత్పత్తి వన్నె బెట్టింది. లోకజ్ఞత జతగూడి, సముచితమైన రచనకు అవకాశం కల్పించింది. ఇట్టి సదవకాశంతో మహోన్నత రసవన్నాటక నిర్మాత కాగలిగారు శ్రీనివాసరావుగారు.

భారతీయ పాశ్చాత్య నాటకాల రెంటిలోను ఇతివృత్తం ప్రధానంగానే పేర్కొబడింది-

**ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితం**
పంచభిః సంధిభి స్త స్య విభాగః సంప్రకల్పితః[1]

అని భరతముని ప్రవచనం. అంటే నాటకానికి **ఇతివృత్తం** శరీరం వంటిదని స్పష్టం. ఇట్లే అరిస్టాటిల్ నిర్వచనం గూడ ఉంది. **The plot, then, is the first principle, and, as it were the soul of tragedy; character holds the second place.**[2] —అంటే ట్రాజెడీకి ఇతివృత్తం ప్రధానమేకాదు ఆత్మ అనీ, అందు పాత్రలకు ద్వితీయ స్థానమనీ అరిస్టాటిల్ అభిప్రాయం. భారతీయ పాశ్చాత్య రూపకమర్యాదలు తెలిసిన శ్రీనివాసరావుగారు, బహుజాగరూకులై సముచితమైన ఇతివృత్తాల్ని ఎన్నుకోవడంలోను, సంవిధాన చాతుర్యంతో వాటిని నాటకాలుగా రచించడంలోను తమ ఇతివృత్త నిర్మాణ దక్షతను ప్రకటించుకొన్నారు.

వీరు రచించిన నాటకాలు ఇరవై ఎనిమిది. వీటిలో వైవిధ్యమెక్కువ. ఇతివృత్త ప్రాధాన్యాన్ని బట్టి సముచిత వర్గీకరణ చేయవచ్చు. 1. చారిత్రక నాటకాలు, 2. పౌరాణిక నాటకాలు;

---

1. నాట్యశాస్త్రము - అధ్యాయము 19-శ్లోకము 1
2. Aristotle's Poetics (Butcher's Translation) P 26, 27.

ఈ పౌరాణిక నాటకాలను మళ్లీ రామాయణ సంబంధి, భారత సంబంధి అనీ, మళ్లీ భారతకథ, జైమిని భారతకథ అనీ, ఇతర పౌరాణికాలు అని విభజించి, 3. ఆంధ్రీకృతనాటకాలు; 4. కల్పితనాటకం, 5. సాంఘికనాటకం; 6. ప్రహసనాలు-అనీ మళ్లీ ప్రహసనాల్ని తెలుగు, కన్నడమనీ అంతర్విభాగం చేయవచ్చు. శ్రీనివాసరావు గారి నాటకాల పరిశోధనలో నాకు లభించిన నాటకాలు ఇరవై ఐదు; ప్రహసనాలు మూడు. లభింపని నాటకాలు మూడు; చంద్రహాస, రాక్షసీ మహాత్వాకాంక్ష, యువతీవివాహము; ప్రహసనం ఒకటి; సమయమునకు భార్య, చంద్రహాస జైమిని భారతంలోని కథ; వీర్ వామనరావు జోషిగారు రచించిన మరాఠీ నాటకానికనువాదం 'రాక్షసీ మహాత్వాకాంక్ష'; సాంఘిక నాటకం 'యువతీవివాహం', 'సమయమునకుభార్య' లోనికథ ఏమిటో తెలియరాలేదు.

చరిత్రపై అత్యధిక ప్రత్యయంగల కోలాచలం శ్రీనివాస రావుగారు ఏ ఇతరాంధ్ర నాటకకర్తగాని రచించనన్ని చారిత్రక నాటకాలు రచించారు. అవి సుఖమంజరి పరిణయము, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, ప్రతాపాక్బరీయము చంద్రగిర్యభ్యుదయము, కాళిదాసు, సుఖమంజరీ పరిణయము చరిత్రాధారంగా రచించబడింది; సుఖమంజరీ ప్రద్యుమ్నుల వివాహంతో కథ అంతమవుతుంది. ఇది కనోజ్ రాజు జయచంద్రుని పుత్రిక రాణీసంయుక్త, ఢిల్లీచక్రవర్తి పృథ్వీరాజును వరించిన కథలాగా ఉంది. అయితే నాటకంలో మార్పులున్నాయి. చరిత్రలోని కథ విషాదాంతం కాగా, శ్రీనివాసరావుగారి నాటకాన్ని సుఖాంతం చేశారు. 'సుల్తానాచాందుబీ' తురుష్కులలో గొప్పరాణి అని పేరుగన్న చాందుబీ చరిత్రను తెలిపేనాటకం. మొదట బీజాపురం, అహమద్ నగరాలను బాలరపక్షంలో రాజ్యంచేసి ప్రజాశ్రేయస్సుకై పాటుపడి మిక్కిలి కీర్తి ప్రతిష్ఠలార్జించిన సాహసికు

రాలిమె; చివర హమీద్ అనేవానిచేత వధించబడుతుంది. శ్రీని వాసరావుగారి పేరు ప్రతిష్ఠలకు జయపతాక వీరి 'రామరాజుచరిత్ర'. దీనికి 'విజయనగరవినాశమనీ,' 'కర్ణాటక రాజ్యనాశ' మనీ నామాంత రాలున్నాయి. The Fall of Vijayanagar అన్న ఆంగ్ల నామం తోనే అది ప్రదర్శించబడి ప్రసిద్ధికెక్కింది. పటాణిరుస్తుమ్ చేత రామరాయలు వధించబడడం ఇందలి ఇతివృత్తం. ఇది రాబర్ట్ స్యూయల్ దొరగారు రచించిన A Forgotten Empire అనే గ్రంథంనుంచి గ్రహీతం. అయినాపటాణిపాత్రతోపాటు ఆషాబీపాత్ర కల్పితం. ఆషాబీ పటాణుల వివాహంతో నాటకం మోదాంతంగా ఉండగా ప్రఖ్యాత నటకులు బళ్లారి రాఘవగారు విషాదాంతంగా మార్చి నటించి సామాజికులను రసానంద సముగ్ధుల గావించేవారట.

పార్థియన్‌లు సింధునదిని దాటి హిందూదేశంలో ప్రవేశించి, అప్పటికే మిక్కిలి ప్రసిద్ధిగాంచిన బలహారి నగరాన్ని నాశంగావించిన విషయం ఇతివృత్తంగా గలది 'శిలాదిత్య' నాటకం. ఇందులో నాటకరసానుగుణంగా మార్పులు కలవు. మైసూరురాజ్యం అరాజ కమై క్షీణించే సమయంలో దాని నుద్ధరించిన యదురాయ, కృష్ణ రాయ, వడయరుల చరిత్రను దెలిపే నాటకం 'మైసూరు రాజ్యము' లేక మైసూరురాజ్యాభివృద్ధి ఇందలి పూర్వాంకమైన ప్రథమాంకేతి వృత్తం కేవలం కల్పితం, 'ప్రతాపాక్బరీయము' ఉత్తమ చారిత్రక నాటకం. తినతిండి లేక నివసించ ఇల్లులేక, అరణ్యాలలో తిరుగుతూ తురకల నెదిరించి, చివరికి విజయదుందుభులతో హైందవౌన్నత్యాన్ని వెలియింపజేసిన రాణాప్రతాపసింహ చరిత్ర, ఇందు నాటకీకరించ బడింది. తాళికోట యుద్ధానంతరం, విజయనగర రాజులు పెను గొండకు తరలిపోయి, కొంతకాలం తరువాత చంద్రగిరిని రాజధానిగా చేసుకొని రాజ్యపాలన చేస్తూండగా, వృద్ధవేంకటరాయల మరణా నంతరం. జగ్గరాయాదులకుట్రతో నుంచి, విజయనగర రాజుల సంతతిని

సంరక్షించి, తదభివృద్ధికి కారణభూతుడైన యాచమనాయకుని చరిత్రను తెలిపే నాటకం 'చంద్రగిర్యభ్యుదయము' అయినా చాందుఖాన్, కుముదిని పాత్రలను రావుగారు ప్రవేశపెట్టారు. రావుగారి చారిత్రక నాటకాలలో చివరిది 'కాళిదాసు'. కాని దీనిలో చారిత్ర కాంశాలకంటే జనశ్రుతిలోని విషయాలే అధికం. ఇది చిలకమర్రి రామానుజాచార్యులవారి 'కాళిదాసు'కు కొంతవరకు అనుకరణ. ఒక డంబరివాడు కాళికాదేవి వరంవల్ల మహాకవి అయిన విధం ఇందలి ప్రధానేతివృత్తం.

శ్రీనివాసరావుగారికి చారిత్రక నాటకాలపైనే ప్రీతి అయినప్పటికీ, వారి నాటకాల్లో రెండువంతులు పౌరాణికాలే. వీరు యుద్ధ కాండం తప్ప తక్కిన రామాయణాన్ని ఐదునాటకాలుగా రచించారు. అవి శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకాపట్టాభిషేకము, లంకాదహనము, కుశలవ, పూర్తిగాకాక పోయినా భారతకథలోని రసవద్ఘట్టాలను గ్రహించి ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, శిరోమణి నాటకాలు రచించారు. జైమిని భారతంలోని కథను గ్రహించి 'బభ్రువాహన' లేక 'అర్జున గర్వభంజనము' అనే నాటకాన్ని రచించారు. ఇవిగాక మార్కండేయ పురాణంలోని కథను గ్రహించి 'మదాలసా' నాటకాన్ని, బ్రహ్మోత్తర ఖండమనే పురాణంలోని సీమంతినీ వృత్తాంతాన్ని స్వీకరించి 'సీమంతినీ' నాటకాన్ని, ప్రౌఢకవి మల్లన విరచిత రుక్మాంగద కథను స్వీకరించి 'రుక్మాంగద'ను ఇంకా సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, గిరిజా కల్యాణము — అనే నాటకాల్ని విరచించి, తమ ప్రతిభా వైభవాన్ని రావుగారు ప్రకటించుకొన్నారు. నాటక నిర్మాణ కౌశలాన్ని, అనల్పకల్పనా శిల్పనైపుణ్యాన్ని వ్యక్తం చేయడానికి చారిత్రకేతివృత్తం బాగా ఉపకరించగలదని శ్రీనివాసరావుగారు నమ్మి తదుచితంగానే రచించారు. అదేవిధంగానే పురాణకథలని గ్రహించినా

వాటిలోనూ కొన్ని మార్పులు చేసి నాటకౌచితికి పాటుపడ్డారు. 'పాదుకాపట్టాభిషేక' నాటకంలో ప్రతీకారేచ్ఛవల్ల కాక, దేవ కార్యార్థం మంథర కైకకు దుర్బోధ చేసినట్లు మార్పుచేశారు కోలా చలంవారు. 'కుశలవ' నాటకంలో శ్రీరాముడు సీతను పరిత్యజించ డానికి కారణం శూర్పణఖా మంథరలనీ, శూర్పణఖ గావించిన మాయ అనీ వారు కల్పించడం జరిగింది. ఈ మార్పు రాజశేఖరుని బాలరామాయణంలో కలదు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా చూపించవచ్చు.

సుప్రసిద్ధ మహారాష్ట్ర నాటకకర్త కే. పి. ఖాడీల్కర్‌గారు రచించిన 'మానాపమానము' నాటకాన్ని అనువదించారు శ్రీనివాస రావుగారు. ద్రవ్యంకంటే శౌర్యమే ముఖ్యమనే నీతిని బోధించే నాటకమిది.

శ్రీనివాసరావుగారి ప్రప్రథమ నాటకం 'సునందనీ పరిణ యము' ఇది కల్పితనాటకం. బుద్ధిబలాన్ని నమ్మిన మంత్రి సుమతి, కళింగదేశపు రాజు ప్రతాపుని పుత్రుని దొంగలచే అపహరింపజేసి, రాజ్యం తన హస్తగతం చేసుకోజూచి, చివరికి సునందనిచే శృంగ భంగం పొందడం ఇందలి కథ. సునందనీ సుదేవుల వివాహంతో నాటకం అంతమవుతుంది.

ఇంక 'నాచిపార్టి, అన్యాయధర్మపురి మహిమ,' అనే రెండు తెలుగులోను, 'ఆచారమ్మన ప్రహసనవు' – అన్నది కన్నడంలోను రచితమైన ప్రహసనాలు.

భారతీయ పాశ్చాత్య నాటక లక్షణాల సముచిత సమ్మేళనమే శ్రీనివాసరావుగారి నాటకాలని చెప్పవచ్చు. ఇతివృత్త నిర్మాణంలో సైతం ఈ విషయం స్పష్టంగా గోచరిస్తుంది. ఉచితమైన భారతీయ పాశ్చాత్య నాటకమర్యాదలను గ్రహించి గద్యపద్య గేయాత్మకంగా

వీరు స్వతంత్రనాటకాలు రచించారు. సంస్కృతనాటక లక్షణాల్లోని ప్రవేశకం, విష్కంభం మొదలైనవాటిని వదలిపెట్టారు. కాని ఆంగ్ల నాటక పద్ధతి ననుసరించి వీరు రంగ విభజన చేశారు. అట్టి కొన్ని రంగాలు ప్రవేశక విష్కంభాల్లాగా ఉపకరించాయనడంలో సందేహం లేదు. మచ్చుకు:- 'సుల్తానాచాందుబీ' (అం. 5 - రం. 1)లో డాండియాగోకు కారాగార శిక్ష విధించబడినప్పటి ఖండోజి, ధోండోజీల సంభాషణ ప్రవేశకంలాగా, ఆరో అంకం ఒకటోరంగం విష్కంభం లాగా ఉన్నాయి. ఆంగ్లనాటకాల్లోని Prologue Epilogue లవంటి పూర్వోత్తరరంగాలను కోలాచలంవారు తమ నాటకాల్లో ప్రవేశపెట్టారు. 'కాళిదాసు, ప్రహ్లాద, సీతాకల్యాణము' లలో పూర్వరంగాలూ, 'సునందనీపరిణయము, సుఖమంజరీపరిణయము, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద'లలో ఉత్తరరంగాలు కలవు. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో ప్రథమాంకమంతా పూర్వరంగంగానే రచితం. అందులో జగన్మోహిని మేనల్లుండ్రైన లక్ష్మణ వీరులను కవలను మోహించి, తిరస్కృత అయి, వారికి మరణ దండన విధింపజేసి, తాను మరణిస్తుంది. ఇదే తరువాతి కథకెంతగానో ఉపకరిస్తుంది. ఇట్లు పూర్వోత్తరరంగాల రచనతో ఇతివృత్తానికి సమున్నతంగా ఉపకరించేలా చేయగలిగారు. సంస్కృతనాటకాల్లోని నాందీ ప్రస్తావనా భరతవాక్యాలు ఎడనెడ కనిపిస్తాయి. 'రుక్మాంగద, చంద్రగిర్యభ్యుదయము, కీచకవధ, ద్రౌపదీ వస్త్రాపహరణము' అనే నాటకాల్లో తప్ప తక్కిన వాటన్నిట నాందికలదు. సునందని, సుఖమంజరి, మదాలస, సీమంతిని, కుశలవ, కాళిదాసు, సుల్తానాచాందుబీ, మానాపమానము-అనేనాటకాల్లో ప్రస్తావనలు కలవు. భరత వాక్యమన్న పేరుతో సునందనీ పరిణయములో మాత్రమే కలదు.

ఇంతకంటె ఆంగ్లనాటక లక్షణాలే వీరినాటకాల్లో అధికంగా కనిపిస్తాయి; ఆంగ్లనాటకాల్లోని సహజమైన పంచకార్యావస్థలు

(Natural divisions of dramatic plot) ఎక్కువ ఉండడం గమనించవచ్చు. 'రామరాజుచరిత్ర'లో నాయకుడైన పటాణి రామరాజు శిరస్సుఖండించి స్వమతరక్షణ గావించడం కార్యం. రామరాజును వధిస్తానని శపథంచేయడంలో ప్రథమకార్యావస్థ (Initial Incident), తోటలో ఆషాబీతో రామరాజు కంఠం ఖండిస్తానని తన ప్రతినను పునరుద్ఘాటించడంలో ద్వితీయ కార్యావస్థ (Rising action or Growth or Complication), రామరాజు తన తండ్రి అని తల్లి వల్ల తెలుసుకొనికూడ రామరాజును వధించడానికే నిశ్చయించుకోవడంలో తృతీయ కార్యావస్థ (Climax or Crisis or Turning point), రామరాజు పటాణిని సర్వసైన్యాధిపతిగా చేయడంలో చతుర్థకార్యావస్థ (Falling action or Resolution or Denouement), యుద్ధరంగంలో రామరాజు కంఠం నరికి విజయంతో, ఆషాబీని కలుసుకోవడంలో పంచమ కార్యావస్థ (Conclusion or Catastrophe)అని ఈవిధంగా పంచకార్యావస్థలను వింగడించవచ్చు. వీరి ప్రసిద్ధ నాటకాలన్నిట వీటిని చూడవచ్చు. కాని 'ద్రౌపదీ వస్త్రాపహారణము, శ్రీరామజననము, సీతాకల్యాణము, గిరిజాకల్యాణము'- అనే నాటకాల్లో వీటికై ప్రయత్నించడం నిష్ప్రయోజనం.

ఇక్కడే పేర్కొనదగింది సమానాంతరత్వం (Parallelism). శ్రీనివాసరావుగారి నాటకాల్లో సమానాంతరత్వం కలదు. ఇది సన్నివేశాల్లో, పాత్రల్లోను కనిపిస్తుంది. 'సుల్తానాచాందుబీ'లో దుష్టులైన అస్మన్ బేగు, డాండియాగోలు పరుసగా జోరియా, వేరీలను మోహించి వశపరచుకోడానికి చేసిన ప్రయత్నాలలో సన్నివేశసంబంధి సమానాంతరత్వం కలదు. 'పాదుకాపట్టాభిషేకము'న పితృవాక్య పరిపాలనార్థం రాముడు అరణ్యానికి వెళతాడు; భ్రాతృప్రేమచే భరతుడు తనకు లభించిన రాజ్యం పరిత్యజించి అడవికి రామునివద్దకే పోతాడు. ఇందు పాత్ర సంబంధి సమానాంతరత్వం ఉంది. సమా

నాంతరత్వంకంటె నాటకంలో అధికప్రాధాన్యం వహించేది ప్రతి యోగం (Contrast). ఇది పాత్రల శీలస్వభావాల్లోను, సన్నివేశా ల్లోను ఉంటుంది. 'రామరాజుచరిత్రము'న రామరాజు, సలకం తిమ్మయ్యలకు, 'ప్రతాపాక్బరీయము'న ప్రతాపవతీ సుందరాంబల కును, 'చంద్రగిర్యభ్యుదయము'న యాచమనాయక, జగ్గరాయల కును, 'మానాపమానము'న ధైర్యధర, లక్ష్మీధరులకును శీలస్వభా వాల్లో ప్రతియోగముంది. ఇట్లే సన్నివేశాలకు సైతం ఎన్నైనా ఉదాహరణలివ్వవచ్చు.

ప్రతియోగములోనే మరో పద్ధతి కలదు. ఇది నాటకీయ వ్యంగ్యం (Dramatic Irony) అని ఆంగ్లంలో ప్రసిద్ధి పొందింది. రంగంలో పాత్రలు పలికిన మాటలలోగాని, సన్నివేశాల్లోగాని, పాత్ర లొకవిధంగాను, సామాజికులు మరోవిధంగా భావిస్తే దానిని నాట కీయ వ్యంగ్యం అంటారు. ఇది రెండు విధాలు: 1. సంఘటన లేక సన్నివేశసంబంధి. (Irony of situation or incident) దీనినే వస్తు సంబంధి అనిగూడ అనవచ్చు. 2. వాక్యసంబంధి (Verbal Irony) ఈ రెండూకలసి గూడ ఉండవచ్చు. సంస్కృతనాటకాల్లోను ఇది కలదు. భరతముని పతాకాస్థానక మని పేర్కొన్నాడు. ఇది నాలుగు విధాలు; కానీ వీనికి ప్రత్యేకమైన పేర్లు లేవు. పాశ్చాత్య నాటక పద్ధతి ననుసరించి శ్రీనివాసరావుగారి నాటకాల్లో నాటకీయ వ్యంగ్యం కలదు. 'సుల్తానాచాందుబీ'లో డాండియాగో జాబు చదివి, ఆల్మేడాపదవినుంచి తొలగించబడ్డాడనీ, వెంటనే గోవాకు అతడు పోవాలనీ, అందలి విషయమని తెలిపి, ఇది తనకంతకుముందే తెలి సింది కావడంవల్ల లోలోన సంతసించినా, ఆల్మేడా, మేరీలకు కలిగిన దురవస్థకు సానుభూతి చూపినట్లు దుఃఖించినట్లు నటించడంలో సన్ని వేశ సంబంధి నాటకీయవ్యంగ్యం కలదు. 'సునందనీపరిణయము'న సుమతి ఔష్ట్యం తెలియని ప్రతాపుడు పొగడడంలోను, రాజుకు సుమతి "నీప

ట్టికిఁ గట్టనాధరకుఁబట్టము" అని సమాధానమివ్వడంలోను వాక్యకగత మైన నాటకీయ వ్యంగ్యంఉంది. ఇది హాస్యమిశితమైకూడ ఉంటుంది. "సుల్తానాచాంద్‌బీ"లో రఘునాథుడు లతీఫా! "నీకే సందియము వలదు. వీరు పెండ్లికిఁద్వరపడుచున్నారు. మనమందులకే త్వరపడ వలెను" అనే మాటల్లోని అర్థద్వయ స్ఫురణచే హాస్యంతో కూడిన వాక్యగత నాటకీయ వ్యంగ్యంకలదు ఇట్లే ఉక్తి నిష్ఠమై గూడ ఇది ఉంటుంది. ఇది శ్లేషాత్మకమై ఉండడం మరొకపద్ధతి. 'ద్రౌపదీవస్త్రా పహరణము'న మాయాసన్న్యాసి వేషంలోని అర్జునుడు సుభద్రతో "పక్వారుణ బింబఫలములు" అనీ, "నీకు విజయలాభమగుగాక" అని పల్కడంలో శ్లేషాత్మక నాటకీయ వ్యంగ్యం స్పష్టం. ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు బ్రహ్మతో "ఇంద్రుని ఖరాయుధభేద్యము కానటుల నాతనఁవుండవలె"నని వరమడుగగా, బ్రహ్మ "నఖరాయుధ భేద్యు డవుగ నుండు" మని శ్లేషతో చెప్పడంలో భావ్యార్థ సూచనాత్మక నాటకీయవ్యంగ్యం (Prophetic Irony) స్ఫురిస్తూంది. ఇట్లనేక విధాలుఁగా నాటకీయవ్యంగ్యం తమనాటకాల్లో శ్రీనివాసరావుగారు ప్రవేశపెట్టారు.

పాశ్చాత్య నాటకాల్లో మిక్కిలి ప్రసిద్ధిగాంచిన షేక్స్పియరు విషాదాంత నాటకాల్లోని దీర్ఘస్వగతాలవంటివి శ్రీనివాసరావుగారి నాటకాల్లోను కలవు. వీరు నాటక పరిపుష్టికోసం సందర్భోచితంగా ఈ స్వగతాలు రచించడం గమనించదగ్గది. మిక్కిలి ప్రసిద్ధప్రచారాలు పొందిన స్వగతాలుగల నాటకమైన వీరి 'రామరాజు చరిత్ర'లో పటాణి పాత్రకై రచించబడిన స్వగతాలు చాల విలువైనవి. ఇందులో ప్రప్రథమంగా తందాన పాటల్లో హిందూరాజ్య వైభవం విన్నప్పుడు (అం. 2- రం.3); ఉద్యానవనంలో ఆషాబీని కలుసుకొన్నప్పుడు (అం. 2 – రం.5); రామరాజే తన తండ్రి అని తల్లివల్ల తెలుసు కొన్నప్పుడు (అం. 3 _ రం. 3); యుద్ధానికిసిద్ధమవుతున్న సమ

యంలో (అం. 4 - రం. 2); అంతకంటె యుద్ధరంగంలో రామరాజు శిరఃఖండన గావించిన వెనుక (అం. 5. - రం. 5) గల పఠాణీ స్వగతాలు ఒకటికంటె మరొకటి శ్రేష్ఠతరాలు. వస్తువికాసంతోపాటు పాత్రశీలస్వభావాదులు వీటి మూలంగా సువ్యక్తమయ్యాయి. భావ సంఘర్షణలోనైన పఠాణీ పల్కులు అతివిస్తరమే అయినా సహృదయ సామాజికులను రంజించ గల్గాయి. ఇట్లే "బభ్రువాహన, సత్య హరిశ్చంద్రీయము, పాదుకాపట్టాభిషేకము"లలోని స్వగతాలు చాల విశిష్టమైనవే. తరువాతి నాటకకర్తలకు శ్రీనివాసరావుగారి స్వగతాలు ఒరవడి అయ్యాయి.

పైవానికంటె పాశ్చాత్య నాటకాల్లో ఐక్యత్రయం (The Three Unities) కు మిక్కిలి ప్రాధాన్యంకలదు. కాలదేశ వస్త్వైక్యాలను ఐక్యత్రయమంటారు. నాటకకథ ఏకదివసవృత్తమై ఉండాలన్నది అరిస్టాటిల్ మతం. ఒక అంకములోని కథ ఏకదివసవృత్తమై, అంకానికి అంకానికి మధ్య కొన్ని యేండ్ల వ్యవధానం ఉండవచ్చునని సంస్కృత నాటక లాక్షణికుల మతం. పాశ్చాత్యులుగాని, ప్రాచ్యులుగాని దేశైక్యాన్ని గూర్చి చెప్పలేరు. కాని వస్త్వైక్యం మాత్రం చాలా ప్రధానమని పాశ్చాత్య భారతీయలాక్షణికుల అభిప్రాయం. ఐక్యత్రయంలో వస్త్వైక్యానికి అధిక ప్రాధాన్యం ఇచ్చారు శ్రీనివాసరావుగారు. ఏకదివసవృత్తంగా నాటకం రచించడం కష్టమే. కాని కోలాచలంవారి 'పాదుకాపట్టాభిషేకము' రెండు వారాలలోను, 'శిరోమణి' ఇరవై దినాలలోను, 'సుఖమంజరీ పరిణయము' ఒక నెల లోపల, "సత్యహరిశ్చంద్రీయము, లంకాదహనము, మానాపమానము"లు రెండుమూడు నెలలలోపల నడచినట్లు తెలుస్తుంది. కాని తదితర నాటకాలు ఒక ఏడు మొదలు 20, 30 వత్సరాల వరకు కొనసాగాయి శ్రీనివాసరావుగారి నాటకాల్లోని అంకాల మధ్యగల వ్యవధానం రోజులు, నెలలేగాక వత్సరాలుగూడ గడచినట్లు కలదు.

ఐక్యత్రయంలో మిక్కిలి ప్రధానమైంది వస్త్వైక్యం. దీనినే కార్యైక్యం అని గూడ అంటారు. నాటకీయ శిల్పగరిమకిది గీటురాయి. పూసల లోని దారంలాగా నాటక కథైక్యముంటే సహృదయ సామాజికు లను రంజించగలదు. రావుగారి ప్రసిద్ధనాటకం 'రామరాజు చరిత్ర'లో వస్త్వైక్యం నిర్వహించబడింది. ఇట్లే 'శిరోమణి, ప్రహ్లాద, సత్యహరి శ్చంద్రీయము, మానాపమానము' లలోను కార్యైక్యం కలదు. ప్రాసంగికేతివృత్తంగల నాటకాల్లోనే వస్త్వైక్యం పాటించబడింది. రాజకీయపుటెత్తులతో, కుట్రలూ కుతంత్రాలతో, మోసం, దగా, కామవ్యాపారం మొదలైన వాటితో నిండి బహుపాత్రాకమై ప్రాసంగికేతివృత్తాలతో బహుక్లిష్ట భూయిష్ఠమైన నాటకం సుల్తానా చాందుబీలో వస్త్వైక్యం పాటించి ఉండడం మిక్కిలి ప్రశంసించ దగిన అంశం. కాని వస్త్వైక్యం కొరవడిన నాటకాలు "శ్రీరామజన నము, సీతాకల్యాణము, ద్రౌపదీ వస్త్రాపహరణము" - అనే మూడు. ఇవి ప్రసిద్ధ విషయాలు కావడంవల్ల నాటకాలుగా రక్తికట్ట వచ్చునేమో, కాని శిల్పం వీటిలో కొంత కొరవడిందనే చెప్పాలి ఇవి తప్ప తక్కిన నాటకాలలో శిల్పం కొరవడలేదు.

ఇంక సంస్కృత నాటకాల్లో నిషిద్ధాలైన ముద్దులు, కౌగి లింతలు, భోజనం మొదలైన వాటిని పరిత్యజించి సభ్యతను పాటిం చినవారు శ్రీనివాసరావుగారు.

పైవిధంగా శ్రీనివాసరావుగారు అనవసరం అనుకొన్నప్పుడు సంస్కృతనాటక లక్షణాలను పరిత్యజించడానికి గాని, అవసరమని తలంచినప్పుడు ఆంగ్లనాటక లక్షణాల్ని స్వీకరించడానికి గాని వెను దీయలేదు; పైగా వాటి పరిమేళనంతో ఇతివృత్త నిర్మాణ దక్షతను ప్రకటించి తమ నాటకాలలో అనల్ప శిల్ప రామణీయకాన్ని పరి రక్షించి ప్రఖ్యాతి పొందగలిగారు.

## సన్నివేశకల్పనా సామర్థ్యం

ఇతివృత్త నిర్మాణ దక్షత తన నాటకాలలోని సన్నివేశాలమీద ఆధారపడి ఉంటుంది. కథా వస్తువు అందరికీ తెలిసిందే అయినప్పటికీ దానికి తగినరీతిలో సన్నివేశాలను కల్పించి, నాటకానికి గౌరవం సంపాదించడం నాటకకర్తకు గల నైపుణ్యానికి నిదర్శనం. ఇట్టి సన్నివేశకల్పనా సామర్థ్యానికి కొదవలేదు శ్రీనివాసరావుగారిలో. వీరి నాటకాలన్నిట చాలవరకు ప్రథమసన్నివేశాలలోనే నాటకకథా పరిచయంతో పాటు పాత్రల ప్రాముఖ్యం స్పష్టంచేయడం జరిగింది. 'రామరాజుచరిత్ర'లో రామరాజు ఆజ్ఞతో అతని కొలువున సంగీత సభ చేసిన ఒక సంగీతజ్ఞునకు బహ్మనీ సుల్తానులచేత బహుమానం ఇప్పించడానికి పటాని వెడతాడు. బహ్మనీసుల్తానులు రామరాజు శిరః ఖండన చేస్తానని పటాణి పునరుద్ఘాటించిన ప్రతినను పురస్కరించుకొని సంగీతవిద్వాంసుని అవమానించి పంపుతారు. ఈ కారణంగానే విజయనగరానికి, బహ్మనీసుల్తానులకు యుద్ధం కలుగుతుంది. ఈ సన్నివేశానికి నాటకంలో మిక్కిలి ప్రాధాన్యం ఉంది బీజాపురంలోనే గల తన తల్లి మహాబూబుబీ వల్ల రామరాజు తన తండ్రి అని తెలుసుకొంటాడు పటాణి. ఈ సన్నివేశంలో మాతా పుత్రుల మనస్తత్వాలు, నాటకకథలో దీని ప్రాధాన్యం స్పష్టం అవుతాయి. ఇట్లెన్నెని కథాగమనానికి ఉపకరించినవాటిని ఉదాహరించవచ్చు. 'సునందనీపరిణయము'లో మంత్రి సుమతి పుత్రుడు కుబేరుడు సునందినిని వివాహమాడమని కోరినప్పుడు ఆమె యుక్తితో తప్పించిన సన్నివేశంలో సునందని ఉత్తమశీలం, యుక్తి; కుబేరుని అవివేకం, ఔచిత్యానభిజ్ఞతా స్పష్టం. ఇట్లే 'ప్రతాపాక్బరీయము'లో 'నౌరోజుసంత'లో ప్రతాపవతిని బలాత్కరించబోయి, అక్బరు ఆ మహా పతివ్రత వలన బాకుతో సమాధానం.గొన్న సన్నివేశంలో ఆమె పాతివ్రత్య సాహస వీర గుణాలు, అక్బరు పరనారీవ్యామోహం వ్యక్తమయ్యాయి.

ఇట్లే పాత్రల మనః ప్రవృత్తులు స్పష్టమయ్యే సన్నివేశాలు కోకొల్లలు. వీరి నాటకాల్లో సమానసన్నివేశాలు కూడ కలవు. అయినా వాటిలో కూడ వైవిధ్య మెక్కువ. సమానంగా కనిపించినా ఒక సన్నివేశానికి మరొక సన్నివేశానికీ ప్రత్యేకత ఉండితీరుతుంది. ఇట్లు శ్రీనివాసరావుగారు సన్నివేశ కల్పనలో సైతం తమ సామర్థ్యం ప్రకటించి ఉండడం ప్రశంసార్హం.

## పాత్ర చిత్రణా చణత్వం

నాటకీయ శిల్పంలోని మరొక ముఖ్యభాగం పాత్ర చిత్రణ. నాటకకర్తకుండవలసిన ప్రధాన లక్షణాల్లో ఇదొకటి. సంస్కృతలాక్షణికులు పాత్రచిత్రణను గూర్చి ప్రత్యేకంగా చెప్పలేదు. సంస్కృత నాటకంలో నాయకుడు ప్రధానపాత్ర. ఆ పాత్ర చిత్రణలోనే నాటకకర్తృ నైపుణ్యం ఇమిడి ఉండడమేకాక, తదుచితంగా ఇతర పాత్రలు పరిపోషించబడడం జరుగుతుంది. కాని పాశ్చాత్య నాటకాలలో పాత్రచిత్రణకు మిక్కిలి ప్రాధాన్యం కలదు. సహజసుందరమైన పాత్రచిత్రణ చేసినప్పుడే నాటకం సహృదయ హృదయ రంజకమై రసానందాన్ని కలిగించగలదు. నాటకంలోని పాత్రలు పిండి బొమ్మల్లాగా, నిర్జీవమై ఉండక, శక్తియుక్తులతో చైతన్యవంతమై ఉండే నాటకం ప్రేక్షకుల్ని ఇట్టే ఆకట్టుకోగలదు. ఇలాంటి పాత్ర చిత్రణా చణత్వం శ్రీనివాసరావుగారిలో సమృద్ధిగా కలదు. నౌకరు మొదలు మహారాజువరకు, నిరుపేద మొదలు ధనవంతుని వరకు, చెలికత్తె మొదలు మహారాణి వరకు గల ప్రజల మనస్తత్వ చిత్రణలో శ్రీనివాసరావుగారు తమ లోకజ్ఞతా ప్రతిభలను ప్రకటించుకొన్నారు. వీరు పాత్ర పోషణలో చాలావరకు పాశ్చాత్య పద్ధతినే అనుసరించినా, ప్రాచ్య విధానాన్ని సైతం విడనాడలేదు.

పాశ్చాత్య నాటకపద్ధతి ననుసరించి 'రామరాజుచరిత్ర'లో పటాణి పాత్రను విషాదాంత నాయకుడు (Tragic hero) గా ఎంతో మహోన్నతంగా చిత్రించి శ్రీనివాసరావుగారు తమ ప్రతిభను ప్రకటించారు. షేక్స్పియర్ విషాదాంత నాయకులలాగా పటాణి చిత్రించబడ్డాడు. ఈ పాత్రమూలంగానే శ్రీనివాసరావుగారికెంతో ప్రఖ్యాతి వచ్చింది. నటులలో మేటి బళ్లారిరాఘవాచార్యులుగారు పటాణి పాత్రను ధరించి ఆంధ్రజనతను మెప్పించి ఘనత వహించారు. షేక్స్పియరు విషాదాంత నాటకాల్లోని బ్రూటస్, హేమ్లెట్, మేక్బెత్-పాత్రలతో పటాణి సరితూగగలడు. 'ఫ్రాయిడ్' మహాశయుడు ప్రచారం చేసిన 'ఎడిపస్ కాంప్లెక్స్' అనే సిద్ధాంతం ప్రకారం హేమ్లెట్ తన పినతండ్రిని వధించిన విధంగానే, రామరాజు తనతండ్రి అని తెలిసి ఉండికూడ యుద్ధంలో వధిస్తాడు.

విషాదనాయక పాత్ర చిత్రణలో ప్రధానమైన సంఘర్షం (Conflict) పటాణి పాత్రపోషణలో శ్రీనివాసరావుగారు సమృద్ధిగా ప్రవేశపెట్టారు. తల్లివల్ల రామరాజు తన తండ్రి అని తెలిసిన వెనుక పితృగౌరవం, స్వామిభక్తి, తల్లి ఆనతి-ఒకప్రక్క, రామరాజును వధిస్తానని చేసిన శపథం మరోప్రక్క, ఆషాబీ అవమానానికి ప్రతీకారం చేయాలన్న కోరిక ఇంకోప్రక్క ఆధిక్యం వహించిన ఈ పరస్పర విరుద్ధభావాలకు సంఘర్షం కలగడంవల్ల డోలాందోళిత మనస్కుడై ఉండిన పటాణిని ఆషాబీ రామరాజును వధించమని పురికొల్పుతుంది. ఈ భావసంఘర్షం పటాణి స్వగతాలలో సుస్పష్టం అవుతుంది. రామరాజు శిరః ఖండనం చేశాక ధర్మాధర్మాలకు, ఉచితానుచితాలకు, పుణ్యాపాపాలకు మధ్య పటాణి మనస్సులో సంఘర్షం కలిగింది. స్వామి, జనకుడు అయిన రామరాజును వధించాక-

"కనులకుఁగావరం బెగయఁ గప్పఁగ, మిన్నునుమన్నుఁగానకే
యనుపమ ఘోరకృత్యమకటా! యొనరించితి సంగరావనిన్
ఘనునకుఁ గారవంబుననుఁ గాచిదయన్ గనినట్టి స్వామికిన్
జనకునకయ్యో! ఘాతుకుఁడ నల్పితినాతత పాతకంబుఁన్" !!

(అం. 5 - రం. 5)

అని మిక్కిలి వ్యథ చెందాడు.

'రామరాజుచరిత్ర'ను విషాదాంతంగా శ్రీనివాసరావుగారు రచించలేదు. కాని బళ్లారి రాఘవగారు మాత్రం దానిని మార్చి ఆషాఢీని వధించి, తానువధించుకొన్నట్లు పటాణిపాత్రను మిక్కిలి విషాద నాయకునిగా నటించేవారట. అది సహృదయ సామాజికులమన్న నలకు పాత్రమైంది. ఏమైనా అనన్య సామాన్యమైన పటాణిపాత్రకు సందర్భోచితంగా ప్రేమ, కరుణ, దయ, గౌరవం, మమకారం, క్రోధం-మొదలైన భావాల్ని ప్రవేశపెట్టి కోలాచలంవారు అజరామరమైన కీర్తిని సంపాదించారు.

ఇట్లే విషాదాంతనాయక లక్షణాలు 'పాదుకా పట్టాభిషేకము'న దశరథునకు, 'బభ్రువాహన'లో బభ్రువాహనునకు ప్రవేశ పెట్టి ఉండడం గమనించదగ్గ అంశం.

ఆయా పాత్రల చేష్టలవల్ల దుష్టశిష్ట గుణశీలాలు సువ్యక్తం చేయడం శ్రీనివాసరావుగారి నాటకాలన్నిట కలదు. నాటకంలో సంవాదం చాలా ప్రధానాంశం. పాత్రల సంభాషణలచే ఆయాపాత్రల శీలస్వభావాలేగాక తదితరుల మనఃప్రవృత్తులు సుస్పష్టమవుతాయి. 'రామరాజు' చరిత్రలో సలకం తిమ్మయ్య సామంతులతో సంభాషించి నప్పుడు రామరాజు ధర్మబుద్ధితోపాటు, సలకం తిమ్మయ్య మోసం గూడ వ్యక్తమవుతుంది. 'సుల్తానా చాందుబీ' లో చాందుబీ సభదీరి

సంభాషించే సందర్భంలో ఆమె న్యాయనిర్ణయం, ధర్మబుద్ధి, రాజకీయ చతురత మొదలైన ఉత్తమ గుణాలు ప్రకటితమవుతాయి. ఇట్లెన్నైనీ ఉదాహరించవచ్చు.

శిష్టదుష్ట పాత్రపోషణలో అధికంగా పాశ్చాత్య పద్ధతి ననుసరించినా, శ్రీనివాసరావుగారు ప్రాచ్య విధానాన్ని విడనాడలేదు. శిష్టులలోను కొంత దోషం, దుష్టులలో కొంత మంచిని వ్యక్తం చేయడం పాశ్చాత్య పద్ధతి. సత్పాత్రలను దోషరహితులుగాను, దుర్మార్గులను మిక్కిలి దుష్టులుగాను చిత్రించడం భారతీయపద్ధతి. ఈ ద్వివిధ పాత్రచిత్రణ రావుగారిలో కలదు. దొసగులు లేని ఉత్తమ పాత్రలకు 'సుల్తానా చాందుబీ' లోని అబిస్సు, 'మైసూరు రాజ్యాభివృద్ధి' లోని లక్ష్మణవీరులు, యదురాయడు, 'చంద్రగిర్యభ్యుదయము' లోని యాచమనాయకుడు, ఇంకా హరిశ్చంద్రుడు, శ్రీరాముడు, ప్రహ్లాదుడు చక్కని ఉదాహరణలు.

ఉత్తమపాత్రలను మరింత సత్పాత్రలుగా దిద్దితీర్చడం గూడ కలదు. భారతయుద్ధంలో అశ్వత్థామ మరణించాడని ధర్మరాజు చెప్పినట్లుండగా, 'శిరోమణి' నాటకంలో కృష్ణుడు ఘటోత్కచునిచేత చెప్పించినట్లు వీరుమార్చి, ధర్మరాజు కాపాదించబడిన ఆ ఇంత అసత్య దోషాన్ని తొలగించి, సత్పాత్రగా నిరూపించారు.

పాశ్చాత్య పద్ధతిననుసరించి శిష్టులలోను కించిద్దోషముంటుందన డానికి వీరుసృజించిన పాత్రలు కొన్నిగలవు. 'రామరాజు చరిత్ర' లో రామరాజు అసమాన ధీశాలి, చతురుపాయసంపన్నుడై ఉండీకూడ; మహమ్మదీయ స్త్రీలను చెరబట్టడం, నిండు సభలో ముసుగు దీయించడం, పుత్ర వాత్సల్యంతో పటుణిని సర్వసైన్యాధిపతిని చేయడం—అనే దోషాలతోనే నాశనమైనట్లుగలదు. ఇట్లే 'ప్రతాపా

క్బరీయము' లో అక్బరు ప్రతాపవతిని బలాత్కరించడమనే దోషం కలదు.

దుష్టపాత్రలలో సైతం మంచి ఉంటుందని రావుగారు పాశ్చాత్య విధానంతో పాత్రలను చిత్రించారు. 'సునందనీ పరిణయము' లోని సుమతి ఉగ్రసేనుడు, 'సుఖమంజరి పరిణయము' లోని విషయసేనుడు, 'సుల్తానా చాందుబీ' లోని డాండియాగో అస్మన్‌లు-మొదట దుర్మార్గులై ఉండికూడా చివర సన్మార్గులుగా మారినట్లు కోలాచలం వారు చిత్రించారు. మూలంలో దైన్య మెరుగని దుర్యోధనుడు 'శిరోమణి' లో పశ్చాత్తప్తుడైనట్లు శ్రీనివాస రావుగారు మార్చారు.

శ్రీనివాసరావుగారు చిత్రించిన స్త్రీపాత్రలను గూర్చి చెప్పడం అవసరమే. పురుషుల కంటే సాహసికురాండ్రకు సునందని, సుఖమంజరి, ప్రతాపాక్బరీయము లోని కమల, బభ్రువాహనలోని జ్వాలాదేవి ఉదాహరణలు. పురుషుతో సమానమైన సాహసంగలచాందుబీ చంద్రగిర్యభ్యుదయములోని కుముదిని పేర్కొదగిన పాత్రలు. దోసగులులేని మహాప్రతివ్రతలు గలరు. మదాలస, సీమంతిని, చంద్రమతి, సీత మొదలైన వారిందుకుదాహరణ. పరిస్థితులవల్ల దుష్టులుగా వర్తించిన వారు కలరు. "పాదుకా పట్టాభిషేకము" న కైక. 'రుక్మాంగద' లో మోహిని, 'మైసూరు రాజ్యాభివృద్ధి' లో జగన్మోహిని, ఇందుకు చక్కని ఉదా: నీచ పాత్రలై శక్తియుక్తలైన స్త్రీలు గలరు. "శిలాదిత్య" లో కళావతి, 'పాదుకా పట్టాభిషేకము'న మంథర చెప్పదగినవారు. కేవలం దుష్టస్వభావాలూ కలరు. "ప్రతాపాక్బరీయము"న సుందరాంబ, 'చంద్రగిర్యభ్యుదయము'న బాయమ్మ 'మైసూరు రాజ్యాభివృద్ధి' లో ఓబళమ్మ మొదలైన వారని పేర్కొ

వచ్చు. ఇట్లు విభిన్నమన స్తత్వాలు గల స్త్రీపాత్రలను రావుగారు సృజించారు.

సంస్కృత నాటకాల్లోని విదూషకుల వంటి అసలుకు సిసలైన పాత్రలు శ్రీనివాసరావుగారి నాటకాల్లో లేవు. కాని 'సుల్తానా చాందుబీ' లో రఘునాథుడొక్కడు మాత్రం విదూషకునిలా వర్తించినట్లు కలదు. 'సుఖమంజరీ పరిణయము' లో సంజయుడు గూడ కొంతవరకు విదూషకునిగా వర్తించడం జరిగింది.

వీరి నాటకాల్లో అప్రధాన పాత్రలకు సైతం ప్రాధాన్యం ఉన్నట్లు వీరు చిత్రించారు.

శ్రీనివాసరావుగారు వివిధ స్త్రీ పురుషుల ప్రకృతులను పరిశీలించి తమ ప్రతిభావ్యుత్పత్తులనుప్రకటిస్తూ పాత్రచిత్రణగావించారు. వివిధ మానవ మనః ప్రవృత్తులను విశదీకరించి వీరు మహామేధావిగా, మహా మన స్తత్వ శాస్త్రవేత్తలా దర్శన మిస్తారు.

పై పరిశీలనవల్ల ఇతివృత్తాల్ని స్వీకరించి వాటిని సంయోజన పరచుకొని నాటక నిర్మాణం చేయడంలోను, సన్నివేశాలను కల్పించడంలోను, పాత్రల్ని చిత్రించడంలోను శ్రీనివాసరావుగారు తమ దక్షతను నిలబెట్టుకొన్నారని స్పష్టమైంది. వీటి మూలంగా నాటక కర్తగా వారికిగల వైశిష్ట్యమూ, ప్రత్యేకత, మౌళికత (originality) విశదమవుతున్నాయి. ఆ విధంగా తమ నాటకాల్లో నాటకీయశిల్పం పరిరక్షించిన కోలాచలం వారు ప్రశంసనీయులు.

## రచనా శిల్పం

శ్రీనివాసరావుగారి నాటకాల్లో-పైని వివరించినట్లు-నాటకీయ శిల్పానికి రచనాశిల్పం తోడైంది. సంభాషణ రచనా నైపుణ్యం, పద్యరచనా పాటవం, ఛందస్సు, పాటలు, భాష-వీటి ప్రయోగాలను కలిపి రచనా శిల్పమని భావించబడింది. వీటి వివరణమే ప్రస్తుతాంశం.

## సంభాషణ రచనా నైపుణ్యం

నాటకంలో సముచితమైన ఇతివృత్తం, దాని కనుగుణమైన సన్నివేశ సంయోజనం, దాని ననుసరించి ఉచితమైన పాత్రచిత్రణతో పాటు సంభాషణలు సర్వాంగ సుందరమై, రసభావ నిర్భరమై ఉండడం చాలా అవసరం. ఈ సంభాషణ నాటకానికి ప్రాణం. సముచితరీతిని సంభాషణలను నాటకకర్త నడపినప్పుడే నాటకం సహృదయహృదయ రంజకమై ఒప్పారగలదు. శ్రీనివాసరావుగారి నాటకాల్లో ఇలాంటి సంభాషణలకు కొరతలేదు. ఉక్తి ప్రత్యుక్తులతో, చతురమై, సముచితమై, రసభావానుగుణమై, సందర్భోచితమై - సంభాషణలు వీరి నాటకాలన్నిట కలవు. నాటక కార్యం (Action) ను సువిదితం చేయగల సంక్షిప్తత (Brevity) ప్రధానగుణంగా గల సంభాషణలూ ఉన్నాయి. కాని 'సునందనీ పరిణయము' మాత్రం పై వాటికి అపవాదమనే చెప్పాలి. ఇది రావుగారి మొదటి నాటకం కావడంవల్ల నైతేనేమి, ఆనాటి పరిస్థితులబట్టి అయితేనేమి ఇందలి సంభాషణలు సుదీర్ఘమై ఉంటాయి. సుదీర్ఘ స్వగతాలూ ఎక్కువే. తదితర నాటకాల్లో మాత్రం సందర్భోచితమై, సులభగ్రాహ్యమై, సరళమై ఉండడమే వాటి ముఖ్య గుణం. ఇందుకు ఒకటి రెండుదాహరణలు.

అలతి అలతి వాక్యాలతో సంభాషణచతురంగా నడపడం శ్రీనివాసరావుగారికి సాధ్యమవుతుంది. చిన్నచిన్న వాక్యాలవల్ల నాటక కార్యం శీఘ్రంగా కొనసాగగలదు. ఇది నాటకానికి ఆయువుపట్టు. 'చంద్రగిర్యభ్యుదయము' న కుముదిని అనే సార్థకనామధేయ అయిన చంపను బంధించి, కొనిపోవడానికి చాంద్‌ఖాన్ వచ్చినప్పుడు వారిద్దరి మధ్య నడచిన సంభాషణ.

చంప : శూరవరా ! అబలలను బలవంతులు బట్టినచోఁ బలువంతల పాలగుదురు. దూరమాలోచింపుము.

చాందు : నేనాలోచించితిని. బలవంతము తప్ప నాకు వేఱుమార్గము తోఁపదు.

చంప : వీరాగ్రణీ ! నీవునన్ను బలాత్కరించినచో నీకు దక్కునది ప్రాణములేని నా శరీరము.

చాందు : శరీరమో ! శవమో ! పాదుషాగారికిఁ జూపుట నావని.

చంప : అది యా నీనిర్ధారణము ?

చాందు : నిజము, అదియేను !

చంప : ధీరవరా ! నీకు యుద్ధధర్మములు తెలియునా ?

చాందు : పైగంబరు శిష్యుఁడనగు నాకు, యుద్ధధర్మములు తెలియవా ?

చంప : చూడుము. నేను నిశ్శస్త్రిపాణినిగదా ?

చాందు : నిజము.

చంప : పరపురుషునితో స్త్రీలు మల్ల యుద్ధము జరుపుట న్యాయ విరుద్ధము కదా?

చాందు : న్యాయవిరుద్ధమేను.

చంప : అటులయిన, శూరాగ్రణీ! నాకు యుద్ధభిక్షనిమ్ము. నాకొక కృపాణము సైతమిమ్ము. నేనోడినచో నన్ను బట్టికొని పొమ్ము.

చాందు : (స్వగ) ఔరా ! ఈ స్త్రీ సాహసము! నాతో శస్త్ర యుద్ధము సలుపునట. ఆ వినోదమించుక యనుభవించెద. (అనుచు నొక కృపాణమిచ్చును)

వారిద్దరికి యుద్ధము కలిగేలోపల చంపను పోషించిన బ్రాహ్మ ణుడురాగా, అతనివల్ల తన మిత్రుడైన యాచమనాయకునకు కాబోవు ధర్మపత్ని 'చంప' అని తెలుసుకొని తన సోదరిగా చాందు ఖాన్ భావించి యుద్ధవిముఖుడవుతాడు. ఈ సంభాషణలోని చిన్న చిన్న వాక్యాలు నాటక కార్యగమనానికి ఎంతగానో ఉపకరించేవిగా ఉన్నాయి.

సందర్భోచితంగా, రసభావనిర్భరంగా ఆయా పాత్రలకు ఉచితరీతిని రచించబడిన సంభాషణలు కోకొల్లలు! 'రామరాజు చరిత్ర'లో పటాణి బీజాపురంవెళ్లి తల్లి 'మహాబూబుబీ'ని కలుసు కొన్నప్పుడు తన తండ్రినిగూర్చి తెలుపుమని గ్రుచ్చిగ్రుచ్చి అడుగు తాడు. ఆ సందర్భంలోని మాతాపుత్రుల సంభాషణ :

పటాణి : మాతా! జనకుని కులనామములఁదెలియని సుతుని జన్మ మేల? అది యెఱింగింప సంకోచంబు నీకేల?

మహాబూబుబీ : కుమారా అది తెలిసినచో నీకు లాభమేమి?

పటాణి : జననీ! అపుడు గదా నాజనకౌన్నత్య హీనతలు నాకుఁ దెలియును.

మహా : (చింతించుచు) కుమారా! మొఱకు పట్టుపట్టి యీరీతి నను బాధించుట ధర్మముగాదు. ఆ మాట తిరిగి కదిలిం పుము. పుత్రా! నిన్నేలు రామరాజు సుఖమున నున్నాఁడా? నీయందు ప్రేమ తప్పడుగదా?

పటాణి : తల్లీ! ఆ రామరాజు సుఖంబునకే లోపంబు లేదు. అతఁడు నా విషయంబున మిక్కలి ప్రేమఁజూపు చున్నాఁడు.

మహా : కుమారా! నీవతని భయభక్తులతో సేవించుచున్నావా?

పటాణి : అమ్మా! అదియే మోకాని నేనతనిఁజూచినప్పటినుండి యెపుడెపుడు వానిింబట్టి చంపుదునా యను తలంపు గలుగుచున్నది.

మహా : (నిట్టూర్పు విడుచుచు మోమువంచుకొని కుమారా! పలినవానిపైన నీవట్టి ద్రోహముఁదలఁచుట న్యాయమా?

పటాణి : తల్లీ! అది ధర్మముకాదని యెన్నిమారులు నేఁదలఁచినను వాడు మన మతస్థులనుంచు బాధలను జూచినపుడెల్ల నాకా తలంపు మరల నిన్మడించుచున్నది.

మహా : కుమారా! హిందూరాజులకు మన మతముపై దాక్షిణ్యముండునా? మన మతము వారికి హిందువులపై నభిమానముండునా?

పటాణి : మహమ్మదీయకులమునఁ బుట్టిన నేనట్టి హింసలు చూచి యోర్వగలనా? అయ్యో! పోయిన సంవత్సరమున ముదగల్లు నవాబు బిడ్డను బట్టితెచ్చి యాస్థానమున నవమాన పఱచి మోము ముసుఁగుఁదీయించెను.

మహా : ఏమి! ఈ దుర్గుణమును నతఁడింకను వదలలేదా?

పటాణి : తల్లీ! 'ఇంకనూ వదలలేదా'? యను కారణంబేమి?

మహా : కుమారా! చిన్ననాటినుండి యారామరాజునకిట్టి దుర్గుణంబులు గలవని యంటిని.

పటాణి : అమ్మా! నీకెటుల తెలియును?

మహా : (ఆలోచించి) వినుకలిచే.

పటాణి : తల్లీ! అట్టి దుర్గుణాధికుండు వాఁడని కదా నేను వానిఁ జంపఁబ్రతిజ్ఞ చేసినాడను.

మహా : కుమారా ! ఇట్టిబుద్ధి నీకుఁదగదు. పలికిన వానిపై ద్రోహంబు తలఁచుట తన తండ్రిపై ద్రోహంబు తలఁచుట కాదా ?

పటాణి : తల్లీ ! దుర్మార్గుఁడు తండ్రియయిన నేమి ? మఱి యెవ డైన నేమి ? శిక్షార్హుఁడేకదా ? (అం. ౩-రం-౩)

ఇట్టి సంభాషణ సందర్భోచితంగా సాగింది. తరువాత రామ రాజు పటాణి తండ్రియని తల్లి చెబుతుంది. ఇందులో పుత్రునకు తండ్రి పేరు తెలియనీయకూడదని తలంచిన తల్లి మానసిక వేదన, తెలుసుకోవాలన్న కుమారుని ఉత్కంఠా, రామరాజుపై పటాణికి గలకోపం మొదలైన భావాల కనుగుణంగా సంభాషణ రచించబడింది. ఇది 'రామరాజుచరిత్ర' నాటకానికే ఆయువుపట్టు, ఇలాగా ఎన్నైనా ఉదాహరణలు ఇవ్వవచ్చు.

## కవిత్వం

నాటకంలో సామాన్యంగా భావావేశం కలిగినప్పుడు పద్య ముండడం సమంజసమే. ఇది సంస్కృత నాటకాల సంప్రదాయం. ఆంగ్లనాటకాలు సాధారణంగా మోదాంత నాటకాలు సరళమైన పద్యాల్లోను, విషాదాంత నాటకాలు లయాన్విత వచనంలోను ఉంటాయి. తెలుగులో వెలిసిన స్వతంత్రనాటకాలు గద్యపద్య గేయా త్మకంగా కలవు. శ్రీనివాసరావుగారి నాటకాలిందుకు చక్కని ఉదాహరణలు. నాటకంలో పద్యాలు పాటలు ఉండడం సమంజసంకాదని స్వభావవాదుల అభిప్రాయం. పద్యాలుండడం అవసరమని కొందరు తలంచారు. అట్టివారి గుంపులో చేరినవారు శ్రీనివాసరావుగారు. కనుకనే వీరు తమ నాటకాల్లో ఉచితరీతిని పద్యాలు రచించి, సందర్భోచిత రసభావాలకు పరిపుష్టిని చేకూర్చగలిగారు. ఇందుకు వీరి నాటకాలన్నీ ఉదాహరణలే. రావుగారినాటకాల్లో ప్రబంధోచిత వర్ణ

నలకు కొదవలేదు. మచ్చుకు: హరిశ్చంద్రుడు సంతోషాంతరంగుడై చేసిన వనవర్ణన మిక్కిలి రమణీయమై ప్రబంధ వర్ణనలకు తీసిపోవడం లేదు—

నవనవయౌవనోదయ వనంబను భామిని తీవెమేనుఁగెం
జివురుల పాదముల్, నునుపుఁజిగ్గుల కొమ్మల హస్తముల్, శుభో
త్సవమగు కుందకుట్మల విశాలకుచంబులు, పువ్వునవ్వులున్,
సవరుగనంది సద్విటప సౌరభ సంగతిఁజెందెఁజూచితే?

(సత్యహరిశ్చంద్రీయము - అం.2 - రం. 1)

సర్వోపమా సామగ్రి నుపయోగించి నఖశిఖ పర్యంతం స్త్రీని వర్ణించి రావుగారు కృతకృత్యులయ్యారు. దానికి శబ్దార్థాలుకూడ సహృదయరంజకం కావడం ప్రశంసనీయం. 'రామరాజుచరిత్ర'(అం. 2- రం. 5) లో పటాణి ఆషాబీని వర్ణించిన పద్యం ఇందుకు చక్కని ఉదాహరణ.

అందమై మన్మనోనందమై నెలతేని
చందమై చెన్నొందు సకియమోము,
శుద్ధాష్టమీ చంద్రశుభ బింబమునుబోలు
బంగారు ఫలకమీ ఫాలతలము
గొప్పలై మూలలు గొనసాగి ఱెప్పల
కప్పుల నొప్పారు కలికి కనులు,
ఇంచుక కొనవంచి యుంచిన యపరంజి
నసఁదీరు నునుపారు నాతినాస,

ఔర! శృంగార సౌష్ఠవం బౌర! యిచట
ధాత నిర్మాణ నిపుణతఁదగె నయారె!
కవుల యుపమలు సాలవు కలికిఁబొగడ
నాతరమె చాలు పోయెద నాతికడకు

ఈ పద్యం 'మదాలస', 'బభ్రువాహన' నాటకాల్లోను గలదు.

ప్రబంధోచితమైన శబ్దార్థాలంకారయుతమైన పద్యాలు కోకొల్లలు. పద్యాలలో, పద్యపాదాలలో పాత్రల సంవాదం నడచింది. వీరు పద్యాలలో రాగాల పేర్లు చేర్చి రచించడం గూడకలదు. 'సత్యహరిశ్చంద్రీయము' లోని మతంగ కన్యల ద్విపదలలో అనేక రాగాలు కలవు. ఇల్లే 'రుక్మాంగద'; 'శ్రీరామజననము' లలో రాగమాలిక యుక్తంగా సీసపద్యాలు రచించబడ్డాయి.

అనల్ప విషయాన్ని చిన్న పద్యంలో చెప్పడం శ్రీనివాస రావుగారికి చేతనవుతుంది. ప్రహ్లాదుడు గీతాసారాన్నంతటినీ ఒక్క ఆటవెలదిలో వివరించగలిగాడు.

చంపువాఁడెవండు చంపింపఁబడు నెవ్వఁ
డేల జనక! నీకు నిట్టి భ్రాంతి,
జనికి మనికి మరలఁ జావునకును గర్త
హరియకాదె వాని నరయవలదె. (ప్రహ్లాద అం. 3 — రం. 4)

శ్రీనివాసరావుగారు నన్నయ మొదలు వేమన వరకు గల మహాంధ్రకవులందరినీ అనుకరించారు 'ప్రహ్లాద'లో పోతన పద్యాలకు అచ్చుగ్రుద్దినట్టివి కలవు. శ్రీనాథుని సీసపద్యాల తూగు వీరిలోను కలదు. పెద్దన పద్యాలకు అనుకరణలున్నాయి. సునందనీ సుఖ మంజరీ పరిణయాలు వినా తక్కిన నాటకాలన్నిట సందర్భోచితమై, భావానుగుణమైన పద్యాలు రచించి తమ నాటక పద్యరచనా పాట వాన్ని ప్రకటించుకున్నారు శ్రీనివాసరావుగారు.

శ్రీనివాసరావు గారు వివిధచ్ఛందస్సులను వాడారు. మామూలు వృత్తాలతో పాటు సీసం, కందం, తేటగీతి, ఆటవెలది మొదలైనవేగాక నూతనచ్ఛందస్సుల సృజించి తమ నాటకాలలో ప్రయోగించి ఛందశ్శిల్పాన్ని పరిరక్షించారు. ఆ నూతనచ్ఛందస్సులు సందర్భోచితమై సార్థకమై ఉండడం ప్రశంసనీయం. బాణం, భల్లం,

పుష్పహారం-మొదలైన వృత్తాలిందుకుదాహరణలు. ఇట్లు వీరు ఛందో వైవిధ్యాన్ని సైతం స్పష్టం చేసుకొన్నారు.

## పాటలు

పద్యంలాగా పాటగూడ నాటకంలో ఉండడం సహజం కాదన్నది స్వభావ వాదుల సిద్ధాంతం. సంస్కృతనాటకంలో అచ్చమైన పాటలు లేవు; శ్లోకాలు రాగయుక్తంగా పాడబడుతూ ఉండేవి. శ్రీనివాసరావుగారు తమనాటకాల్లో పాటలు కుప్పలుగా రచించారు. కాని వీరికి పాటలపై అంతగ ప్రీతి ఉన్నట్లు లేదు. కేవలం ఆనాటి పామర ప్రజానీకం కోసమే తాము పాటలు రచించామని తెలిపి ఉన్నారు. [3] బహుశః ఆనాడు యక్షగానాలవల్ల వినోదం పొందుతూన్న పామర ప్రజలకోసం యక్షగానంలో లాగే వీరు పాటలు రచించి ఉంటారు. అంతేగాక పార్సీ నాటక పద్ధతి ననుసరించి గూడ ఈ పాటలను వీరు రచించి ఉంటారనడంలోను అసామంజస్యం లేదు.

"సీమంతిని, సుల్తానా చాందుబీ, ప్రతాపాక్బరీయము, చంద్రగిర్యభ్యుదయము, కాళిదాసు, మానాపమానము"— అనే నాటకాల్లో తప్ప తక్కిన వాటిలో శ్రీనివాసరావుగారు పాటలు వ్రాసి ముద్రింపించారు. ఈ పాటలు అనుబంధంలో చేర్చబడి ఉంటాయి. శ్రీనివాసరావుగారి పాటలలో రాగతాళానుగుణంగా భాష సాగదీయబడి వికృత రూపం పొందకుండడం ప్రశంసార్హం. వీరి పాటలకు సాహిత్య గౌరవం సహితం కలదు. లీలావతి ప్రహ్లాదుని ఊయెలలో ఊచే సందర్భంలోని పాట ఇందుకు చక్కని ఉదాహరణ.

రారా చిన్నెల నగవుల నాబాలా
సుగుణాల వాలా ॥రారా॥ పల్లవి॥

---

3. సునందనీ పరిణయ నాటక పీఠిక పు. 1, 2.

సోముగోమును దోము మోముగల
కాముని బోలెడు కాంత శరీరా ॥రారా॥ ౧॥

సుందరకాయా అందెలు మ్రోయూ
చిందులు ద్రొక్కుచు శీఘ్రముగా రారా ॥రారా॥ ౨

శ్రీనివాసు నీ చిత్తమందునా
చింతన జేయుచు గంతులు వేయుచు ॥రారా 3

వీరి పాటలు సాధారణంగా అపేలవమై, అకృత్రిమమై, సందర్భోచితమైకలవు. భావం తీవ్రమైనప్పుడు పాటలు కలవు. కోపో ద్రేక భక్త్యావేశాలలో తప్పక పాటలుంటాయి. ప్రణయ సంవాదం లోను, ఎడనెడ ప్రకృతి, వ్యక్తివర్ణనలలోను పాటలకు స్థానముంది. ఇవన్నీ మిక్కిలి క్లుప్తంగా ఉండడం గమనించ దగ్గది. నాటకాద్యంతా లల్లో మంగళాత్మకమైన పాటలు వీరు రచించారు ఇట్టి పాటల రచనచే శ్రీనివాసరావుగారు తమ సంగీతజ్ఞతను సైతం సువ్యక్తం చేసు కొన్నారు.

## భాష

నాటకంలో పాటలు, పద్యాలతోపాటు సంవాదంలో సముచిత భాష ప్రయుక్తం కావడం అత్యావసరం. ఇట్టి భాషకు రావుగారి నాటకాల్లో కొరతలేదు. నాటకంలో ఉచితమైన భాష ప్రయుక్తం కావడం ముఖ్యం. నాటకం రంగ ప్రయోజనం గలది గనుక అందరికీ సులభంగా అర్థమయ్యే భాష వాడడం వాంఛనీయం. ఇట్లే శ్రీనివాస రావుగారి నాటకస్థభాష నాతికఠినమై, అపేలవమై, రసభావానుగుణమై కలదు. సరళ భాషా ప్రయోగమే వీరి ముఖ్యపద్ధతి. అలతి అలతి పదాలతో సరళమైన వాక్య రచన చేయడంతోపాటు సందర్భోచితంగా సమాస భూయిష్ఠ రచనలోను వీరు అసామాన్యులే. "రామరాజు చరిత్ర" లో పటాణి బహ్మనీ సుల్తానుల వద్దకు వెళ్ళినప్పుడు వారు

"మీ పలికకు క్షేమమా?" అని ప్రశ్నించగా, పటాణి సమాధానం:— 'మహాప్రభూ! ప్రబలారి వార నిబిడాంధకార నివారక ప్రచండకర తీక్ష్ణభానులు, విపులాభి యాతిజాత ఘూజాత నిర్మూలన కరబృహ ద్భానులు, ఘోరవైరి నారిజన ముఖకమల వినాశకర హిమభానులగు భామినీ సుల్తానులు కృష్ణపక్ష చంద్రుని బోలె దినదినము క్షీణించు చుండ మా యేలికకుఁ గొఱంత యేల కలుగును?" (అం. 3—రం. 2) ఇట్లే ఈ నాటకంలోని పంచమాంకం పంచమరంగంలో పటాణి స్వగతంలో ఇలాంటి భాషకు కొదవలేదు. అందలి భాష ఆయా రస భావాల కనుగుణంగాఉంది. ఇంకాశబ్దార్థాలంకారయుతమై, శ్లేషా త్మకమై గూడ వీరి భాష సహజ సుందరమై ఉంటుంది. తెలుగు జాతీయాలకు, నుడికారాలకు, సామెతలకు నిలయం వీరి భాష.

ఇచట పాత్రోచిత భాషను గూర్చి సైతం ఒక మాట చెప్పడం అవసరమే. సంస్కృత నాటకాల్లో ఉత్తమ మధ్యమ పాత్రలకు సంస్కృత భాషను, స్త్రీ, నీచ పాత్రలకు ప్రాకృత భాషను ప్రయో గించడం పరిపాటి. సంప్రదాయ బద్ధులైన వేదంవారు ఇలాంటి పాత్రో చితభాషను తమ నాటకాల్లో ప్రయోగించారు. అంటే తెలుగు నాటకాల్లో ఉత్తమ పాత్రలకు గ్రాంథిక భాషను, నీచ పాత్రలకు గ్రామ్య భాషను ప్రయోగించడంలో నాదెళ్ల పురుషోత్తము గారు ఆద్యులైనా, వేదంవారు పాత్రోచిత భాషాప్రయోగానికి ఎక్కువ ప్రచారంతెచ్చారు. ఇంతేగాక నాటకంలోని మహమ్మదీయ పాత్రలకు తురక తెలుగును సైతంవాడారు. కానీ శ్రీనివాసరావుగారు ఎడనెడ నీచ పాత్రలకు గ్రామ్యం వాడినా పాత్రోచిత భాషపై వీరికి గౌరవం లేదు. పైగా గ్రామ్య భాషను ప్రయోగించరాన్నది వీరి సిద్ధాంతం. అందువల్ల భాషాభివృద్ధి జరగదని వీరి ప్రగాఢవిశ్వాసం. అందుకే వీరు గ్రాంథిక భాషావాదుల గుంపులో చేరిన వారన్న విషయం పూర్వోక్తం. వీరు పటాణి మొదలు సర్వ మహమ్మదీయ పాత్రలకు

సలక్షణమైన గ్రాంథిక భాషనే ప్రయోగించారు. అయినా పాత్ర, సందర్భం, రసం, భావం వీటన్నిటిని మనసులో ఉంచుకొనే తదుచితంగా వీరు భాషను ప్రయోగించి తమ విజ్ఞతను ప్రకటించుకొన్నారన్నది నిర్వివాదాంశం.

ఇట్లు శ్రీనివాసరావుగారు నాటకోచితమైన సంభాషణలకు తగిన భాషనువాడి, పద్యగేయాత్మకంగా నాటకాలు రచించి రచనా శిల్పాన్ని పరిరక్షించడం కొనియాడ దగిన విషయం.

## నాటిక రచనా ప్రయోజనం

ఉత్తమ గుణగరిష్ఠమైన నాటక రచన వల్ల ప్రయోజనం (Purpose) సైతం ఆశించారు శ్రీనివాసరావుగారు; నీతిని బోధించటం మొదటి ప్రయోజనం; సంఘంలోని దురాచారాల్ని నిర్మూలించడం రెండో ఆశయం; వీటిని సాధించడానికి నాటకాన్ని ప్రయోగించాలన్నది మూడోది. ఇట్లీ మూడు ప్రయోజనాలను నాటక రచన వల్ల శ్రీనివాస రావుగారు సాధించారు.

### నీతిబోధ

నాటకంలో రసానందంతో పాటు నీతిబోధ ఉండడం అవసరం. ఇందుకు శ్రీనివాసరావుగారి నాటకాలన్నీ ఉత్తమ నిదర్శనాలే. నీతి బాహ్యమైనది గాని, నీతి రహితమైనదిగాని వీరి నాటకాల్లో లేదు. సారంగధర చరిత్ర, కుమారరామ చరిత్ర మొదలైనవి నీతికంటె అవి నీతినే ప్రజలకు బోధించగలవనీ, వాటిని నాటకీకరించడం ఉచితం కాదనీ వీరు ప్రవచించారు.[1] ఇట్లే 'ద్రౌపదీ వస్త్రాపహరణం' కూడ నాటకంగా చేయడానికి తగదని వీరి భావన. కానీ తరువాత సారంగధర వంటి కథను 'మైసూరు రాజ్యాభివృద్ధి' లో చేర్చారు; 'ద్రౌపదీవస్త్రా

1. The Dramatic History of the World p. 225.

పహారణ' నాటకం రచించారు. 'మైసూరు రాజ్యాభివృద్ధి' లోని పూర్వాంకంలో లక్ష్మణవీరులను మేనల్లుండ్రను జగన్మోహిని మోహించి, తిరస్కృత అయి, తత్ఫలితంగా వారిని వధింపజేసి, తాను మరణిస్తుంది. తరువాత లక్ష్మణ వీరులే యదురాయ కృష్ణ రాయలుగా పునర్జన్మిస్తారు. ఈకథచే పూర్వాంకంలోని కథ మరు గున పడిపోగలదు; అసలు కథ ప్రాధాన్యం వహిస్తుంది. అందుచేతనే రావుగారీ నాటకాన్ని రచించి ఉంటారు. ఇది తప్ప తక్కిన వన్నియు నీతిమంతములయి ఉన్నాయి. వీరి ప్రథమ నాటకమైన 'సునందనీ పరి ణయము' లో బుద్ధిబల, దేహబలాల కంటె దైవబలమే హెచ్చని నీతిని వీరు ప్రబోధించారు. నీతిబోధ పై వీరి కధికాభినివేశం కలదు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావ్య న్యాయమే కాదు, భారతీయ తత్వమే అది. దానిని శ్రీనివాసరావుగారు తమ నాటకాల్లో ప్రతి పాదించారు. ధర్మానికి విజయము సర్వత్ర వీరి నాటకాల్లో కలదు. హరిశ్చంద్రుడు, రుక్మాంగదుడు, రాముడు, భరతుడు, ప్రతా పుడు, యాచమనాయకుడు, ధైర్యధరుడు మొదలైన సత్పురుషులు ఘోరకష్టాలనుభవించినా చివర సౌఖ్యమందడం నిరూపితం. తన్మూ లంగా ధర్మానికి విజయం కలిగింది. దుష్టులైన ఉగ్రసేనుడు, సుమతి, విషయసేనుడు, అస్మన్‌బేగు, డాండియాగో, మదనుడు, జగ్గ రాయడు, కీచకుడు, దుర్యోధనాదులు మొదట సుఖమనుభవించినా చివర తగిన శిక్ష అనుభవించారు. ఇది కావ్య న్యాయం.

స్త్రీకి పాతివ్రత్యం పరమోత్కృష్టగుణంగా శ్రీనివాసరావు గారు నిరూపించారు. 'సునందనీ పరిణయము' లో జయదేవి, 'మదా లస'లో మదాలస, కుండల, 'రుక్మాంగద'లో సంధ్యావళి, 'సత్యహరి శ్చంద్రీయము'న చంద్రమతి, 'పాదుకాపట్టాభిషేకము'న కౌసల్యా-సతికి పతిభక్తి పరమ ధర్మమని స్పష్టంచేశారు. సీతాదేవి పతిభక్తి అనన్య సామాన్యమే కాదు ఆదర్శప్రాయమూను! 'ప్రతాపాక్బరీయము'లోని

గాంధారి, ప్రతాపవతులు ప్రదర్శించిన పతిభక్తి ఎనలేనిది. పాతివ్రత్య విరహిత అయిన స్త్రీ ఇడుమలనుభవిస్తుందనడానికి నిదర్శనం కలదు. 'మైసూరు రాజ్యాభివృద్ధి' లోని జగన్మోహిని, 'శిలాదిత్య' లోని కళావతి ఇందుకు తగిన ఉదాహరణ.

స్త్రీ పురుషులు పరపురుషులను, స్త్రీలను కోరడం పాపహేతువని వీరు తలంచారు. పరస్త్రీ వ్యామోహితులు నాశన మవుతారని వీరు నిరూపించారు. రామరాయలు, అస్మన్ బేగు, డాండియాగో, మదనుడు, విషయసేనుడు మొదలైన వారిని ఇందుకుదాహరించవచ్చు. అట్లే స్త్రీలు సైతం పరపురుషులను తాకుట దూష్యమని వివరించారు.

బాహిరమైన శత్రువులనే గాక అంతరంగికమైన అరిషడ్వర్గం - కామక్రోధాదులను జయించాలన్నది వీరి ముఖ్యమైన తలంపు. దీనికి వీరి నాటకాలన్నీ ఉదాహరణలే.

మానవ కార్యాచరణలో పట్టుదల, కార్యదీక్ష ముఖ్యమని వీరు ఎంచి, తదుచితంగా నాటకాల్లో వివరించారు. ప్రహ్లాదుడు తండ్రి ఎన్ని బాధలు పెట్టినా తాను పట్టిన పట్టు వదలలేదు హరిశ్చంద్రుడు సత్య నిష్ఠవల్లనే కష్టాలనుభవించడం జరిగింది. నిష్ఠాగరిష్ఠులు, పరిశుద్ధాత్ములు కావడంవల్లనే కడగండ్లు గడచి చివర మేరీ, ఆత్మోదాలు సుఖం అనుభవించగలిగారు. పట్టుదల, కార్యదీక్ష, నిష్ఠకల ప్రతాపుడు మహమ్మదీయులను జయించి విజయోపేతుడయ్యాడు.

ఇంకనూ దైవభక్తి, మాతాపితృభక్తి, భ్రాతృప్రేమ సాహసం, ఔదార్యం, సర్వమానవ సౌభ్రాత్రం మొదలైన ఉత్తమ గుణాలు అవసరమని శ్రీనివాసరావుగారు నిరూపించారు. 'నాచి పార్టీ' లో వేశ్యావృత్తి నిర్మూలనను, 'అన్యాయ ధర్మపురి మహిమ' లో అవినీతివల్ల కలిగే దుష్ఫలితాలను, "ఆచారమ్మన ప్రహసనవు" లో

అనాచారమనీ నీతికరమనీ వర్ణించారు. ఇట్లు వీరు నీతిబోధను తమ నాటకాలన్నిట ప్రవేశపెట్టడం ప్రశంసార్హం.

## సంఘ సంస్కరణ

ఇక్లే శ్రీనివాసరావుగారికి సంఘసంస్కరణపై అత్యంతాభినివేశం కలదు. నాటకరచనవల్ల దీనిని సాధించవెంచినవారు రావుగారు. ఆధునికయుగంలో సంఘసంస్కరణార్థం సాహిత్యాన్ని సాధనంగా గ్రహించిన ప్రథములు కందుకూరివారు. శ్రీనివాసరావుగారు గూడ సాంఘికదురాచారాలను దుయ్యబట్టి ఉండడం గమనించవచ్చు. చాలవరకు వీరు చారిత్రక నాటకాల్లోనే సాంఘికదురాచారాలను గర్హించారు; ప్రజలను ప్రబోధించారు.

అతిబాల్య, వృద్ధవివాహాలను వీరు గర్హించారు. 'రామరాజుచరిత్ర'లో రామరాజు వధానంతరం తురుష్కసేనలోని ఒకడు, యజ్ఞహోమయాజి అనే బ్రాహ్మణుని భార్యను అపహరించగా, ఆ వృద్ధుడు బహ్మనీ సుల్తానులతో మొరపెట్టుకొంటాడు. మిక్కిలి ముదుసలి అయిన ఆ బ్రాహ్మణుడు ఏమీ తెలియని పసిపాపను వివాహం చేసుకొన్నందుకు సుల్తానులు ఎంతగానో నిందించినట్లు రావుగారు వర్ణించారు. వృద్ధవివాహంవల్ల కలిగే అనర్థాలను కళాత్మకంగా 'అన్యాయధర్మపురిమహిమ' ప్రహసనంలో చక్కగా వివరించారు.

కన్యాశుల్క విధానాన్ని వీరు ఖండించారు. 'శిలాదిత్య' లో కళావతి, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహిని డబ్బుకాశపడి తమ్ము వృద్ధులకు కట్టబెట్టిన తలిదండ్రులను నిందిస్తారు. కళావతి వధా సమయంలో "తరుణీ మణికి - సమవయస్కుడుగాని భర్తను గట్టు తలిదండ్రుల నెంత దూషించినను. దీరదు. అయ్యయ్యో! బంగరున కాశించి యంగనలను వృద్ధజంబుకములకిచ్చి వారి జన్మమే భంగపర

చెదరు" అని మిక్కిలి వాపోయింది. ఇట్లే జగన్మోహిని "అయ్యో! పాపాత్ములారా! చండాలులారా! తలితండ్రులారా! ధనపిశాచావేశపీడితులై మీ వయసు బిడ్డను దయమాలి యీ ముదిబూచికి నిచ్చితిరే?" అని నిందించి, తాను మరణించ నిశ్చయించుకొని "కన్నబిడ్డలను ధనాశచే వృద్ధులకిచ్చి వివాహంబు సేయు జనులకు బుద్ధి రానిమ్ము" అని దుఃఖిస్తుంది. ఇట్లే 'అన్యాయధర్మపురి మహిమ'లో సరస్వతి తలిదండ్రులు ధనాశచే ముగ్గురు ముసళ్లకు మూడుసార్లు వివాహం చేసినందువల్ల కల్గిన అనర్థాలను శ్రీనివాసరావుగారు కన్నులకు గట్టినట్లు వర్ణించారు.

సతీ సహగమన దురాచారాన్ని నిరసించి, వితంతూ వివాహాలను ప్రోత్సహించారు వీరు 'ప్రతాపాక్బరీయము'లో వీటిని చమత్కారంగా చిత్రించారు. అక్బరు చిత్తూరును ముట్టడించి విజయం పొందగా, క్షత్రియాంగనలు చితిలో దూకుతూండగా "హా! చూడ నసహ్యంబిది. నేనేలు ధారుణి నిట్టి క్రూరకర్మంబు జరుగనటులఁ జూచెద. ఏమీ! విధి కృతంబున విగతాసువగు పతి చితిఁ గలిసిన మాత్రాన, విధివిరోధంబుగ సతిచితిఁగలయనేల? ఇది హిందువుల నీతి విధిగ నుండినను నాయావచ్ఛక్తి ధారవోసి, సర్వప్రయత్నము లొనరించి, యీ ప్రాణయుత సతీమారణ కర్మంబు నిలిపెద" అని కంకణబద్ధుడవుతాడు తరువాత అతడు పతులులేని సతులు వివాహమాడునట్లు శాసనం చేస్తాడు. ఇట్లే విధవా వివాహానికి అక్బరు అంగీకరించినట్లు రావుగారు చిత్రించారు. అక్బరు సభలో బీరుబల్లుతో జరిగిన సంభాషణ:

అక్బరు : బీరుబల్లు! పతులులేని సతులకు బిడ్డ పాపలేల కలుగుదురు?

బీరుబల్లు : మహాప్రభూ! ఈ శరీరము విషయాదులకు లోబడినది. అందునఁబురుషులకంటెను స్త్రీలకుఁజాంచల్యంబు హెచ్చు.

అక్రూరు : అటులుండినచో సతులు మరలఁబతులను బొందదనగును.

బీరు : ఇది మఱి బాగున్నది. విధవా వివాహంబుగా నగునని కదా మీ తాత్పర్యము ?

అక్రూ : కానగును. అందునఁదప్పేమి ? సతులు చితిఁగలిసినప్పుడు పతులు మరల సతులను జేసికొనరా ? అదే న్యాయమే సతులకు ?

అని ఇట్లు అక్రూరు క్రమబద్ధమూ, న్యాయబద్ధమూ చేశాడు. ఇట్లు శ్రీనివాసరావుగారు సతీసహగమన తిరస్కారమూ, స్త్రీ పునర్వివాహ పురస్కారమూ అంగీకరించారని స్పష్టమవుతుంది.

స్త్రీకి విద్యాస్వాతంత్ర్యాలు అవసరమని 'బభ్రువాహన', 'కుశలవ' నాటకాల్లో వీరు నిరూపించారు.

ఆచారాలపేరుతో ప్రజలుచేసే అనాచారాలను శ్రీనివాసరావుగారు మిక్కిలి ఖండించారు. ''రామరాజుచరిత్ర'లో ఐదేండ్ల పసిపాపను యజ్ఞకార్యార్థం వివాహమాడినట్లు యజ్ఞ సోమయాజి చెప్పగా, బహ్మనీసుల్తానులు యజ్ఞాలపేరు చెప్పి మేకమాంసం తినడానికా అని అతనిని తృణీకరిస్తారు. పూర్వకాలంలో ఎంతో పవిత్రంగా శాకములనే బలిగా యజ్ఞంలో అర్పిస్తూ ఉండేవారు. కాలక్రమంగా అది మారిపోయి పశుబలిచే అపవిత్రం చేయబడిందని రావుగారు ఖండించారు. 'ఆచారమ్మ నప్రహసనవు'లో నేతి బీరకాయలాగా 'ఆచారమ్మ' అనే పేరుతో మహా ఆచారవంతురాలుగా చలామణి అవుతూ, లోలోపల ఎన్నో అనాచారాలు చేసినట్లు, చివరికి పరాభవించబడినట్లు శ్రీనివాసరావుగారు మిక్కిలి చమత్కారంగా చిత్రించారు.

వేశ్యావృత్తిని వీరు మిక్కిలి నిరసించారు. 'నాచిపార్టి' (Nautch Party) ప్రహసనంలో వేశ్యాలోలుడైన భోగిశెట్టి జోగిశెట్టిగా మారిన కథను వ్యంగ్యంగా, హాస్యసమ్మిశ్రితంగా అద్దంలోలాగా ప్రతిబింబింపజేశారు శ్రీనివాసరావుగారు.

మద్యపానంవల్ల కలిగే అనర్థాలను 'సుల్తానా చాందుబీ'లోను, 'అన్యాయధర్మపురిమహిమ'లోను వివరించారు.

జాతులు వేరైనా మానవులందరూ సమానమని వీరి ప్రగాఢ విశ్వాసం. 'చంద్రగిర్యభ్యుదయము'లో "ప్రపంచములోని సకలులు దేవాంశ సంజనితులు, జాత్యాదిభేదములు వ్యవహారోపయుక్తములు. ప్రపంచమొకటియైనను మానవులు తమ వ్యవహారమునకు దానిని దేశములుగ విభజించి వేఱువేఱు నామములిడిన మాత్రాన ప్రపంచమొకటియగాని వేఱుకాదు. అటులనే జాతి భేదములును" అని సదాశివయోగి యాచమ నాయకున కుపదేశించడంలో సర్వమానవ సమానత్వాన్ని శ్రీనివాసరావుగారంగీకరించారు. ఇంకా సర్వమత సమానత్వాన్ని వీరు తమ నాటకాల్లో నిరూపించారు.

ఇట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకాల్లో సంఘసంస్కరణాభిలాషను ప్రకటించి ఉత్తమ సంఘసంస్కర్తగా ప్రకటించుకొన్నారు.

## నాటక ప్రయోగం

ఇంక రంగస్థలంపై ప్రదర్శించడం నాటక రచనకు మూడో ప్రయోజనం. నాటక ప్రదర్శనవల్లనే పై రెండు ప్రయోజనాలను అనగా ప్రజలకు నీతిని బోధించడం, సంఘసంస్కరణ గావించడం— అనే వాటిని సాధించడానికి వీలవుతుంది. దీనిని అక్షరాలా పాటించిన వారు రావుగారు. ప్రదర్శనానుకూలంగా నాటకం రచితమయి

నప్పుడే దాని విశిష్టత గోచరిస్తుంది. లేనిచో దానికి, శ్రవ్య కావ్యానికీ భేదం లేకుండా పోతుంది. దీనిలోని దృశ్యత్వ లక్షణం వల్లనే 'కావ్యేషునాటకం రమ్యమ్' అనే ఆభాణకం బయలుదేరింది. రంగస్థలంపై ప్రదర్శించబడినప్పుడు నాటక సందర్శనం వల్ల సహృదయ సామాజికులు అమితానందం పొందగలరు. ఇది పండితులకే గాక పామరులకు సైతం ఉపకరించ గలదు. అపేలవమై, రసపరిపుష్టితో నాటకం ఉండడం మిక్కిలి అవసరం. ఇలాంటి లక్షణాలకు శ్రీనివాస రావుగారి నాటకాల్లో కొరతలేదు. నాటక యుక్తులు లేని నాటకాలు రంగంలో రాణించలేవని వీరి దృఢాభిప్రాయం. "Some dramas though ably written by great poets are not fit for the stage, because these poets are not versed in dramatic language and stage tricks''. 2 ఇంకా ఈ 'ప్రపంచ నాటక చరిత్ర'లో చివరనాటక కర్తలకు, నటులకు, నాటక సమాజాలకు, విమర్శకులకు, సామాజికులకు-శ్రీనివాసరావుగారు చేసిన సూచనలచే నాటక ప్రయోగంలో వారికిగల విశిష్టమైన అనుభవం, నాటక ప్రదర్శనను విజయవంతం చేయగల నాటక యుక్తులు స్పష్ట మవుతాయి.

ఇలాంటి అనుభవజ్ఞులైన రావుగారి నాటకాలు ప్రదర్శన యోగ్యాలై ఉండడంలో అతిశయోక్తిలేదు. ఇంతేగాక ఆనాటి ప్రజలను, ప్రదర్శన పద్ధతులను సైతం మనం గుర్తుంచుకోవాలి. చాలావరకు ఆంగ్ల, పార్శీ, ధార్వాడ నాటక సమాజాల నాటక ప్రదర్శనా ప్రభావంతో ఆరంభమైన మన నాటకాలు తప్పకుండా వాటిలాగే ఉంటాయనడంలో సందేహంలేదు. శ్రీనివాసరావుగారి నాటకాలు వీటికంటె వేరుగా ఉండడానికి వీలులేదు. అయినా అనుభవశాలి అయిన రావుగారు బహుజాగరూకులై ప్రదర్శన యోగ్యంగానే తమ నాటకాలను రచించారు. పైగా "సుమనోరమ సభా

---

2. పైదే P. 3.

నాటక సమాజం" వారు ప్రదర్శించడానికే వీటిని వీరు రచించారు. నాటక ప్రదర్శన కవసరమైన చక్కని 'వాణీ విలాస నాటకశాల' ను బళ్ళారిలో ప్రప్రథమంగా స్థాపించిన ఘనులు వీరు. నాటక ప్రదర్శన విజయవంతం కావడానికి నాటక కర్తృసహకార మవసరమని వీరు కంఠోక్తిగా చెప్పారు. "In getting up the play take the author for guide. Remember that in France the author of the play is everything to the company. The French, therefore are always successful on the stage; but in Germany, the author is little or nothing. The German plays are not, therefore, so successful." [3] ఇదే విధంగా రావుగారి దర్శకత్వంలో నాటకాలన్నీ విజయవంతమైన వనడంలో సందేహంలేదు. ఇందుకు నిదర్శనం సైతం కలదు. "He (Kolachalam Srinivasa-Rao) has construc'ed a permanent theatre (Vanivilasa Natakasala) for the company (Sumar orama sabha) at the cost of Rs 10,000 and the success of the company is not a little due to the active interest and guidance of Mr. Srinivasa Rao" [4] అని ప్రస్తుతించ బడిఉండడం గమనించ దగ్గది.

శ్రీనివాసరావుగారి నాటకాలనేకం ప్రదర్శింపబడినట్లు వారే నుడివి ఉన్నారు. "ఈపురి (బళ్ళారి) నుండు సుమనోరమసభ" వారు దానిని (సుల్తానా చాందుబీ నాటకాన్ని) జక్కగఁగ బ్రదర్శించిరి.

3. పైదే P. 17.

4. "Encyclopaedia of the Madras and the adjiacent states" p 643. Ed: L. V. sastry and M. Venkata-rangaiah.

"పై నుదాహరింపఁబడిన పదినాటకములలో నాలుగు నాటకములు సుమనో రమసభవారు ప్రదర్శింపఁగ నేఁ జూచితిని"[5] బళ్లారి పట్టణంబున 'సుమనోరమ' యను నాటక సంఘ మొకటి యుండెను. ఆ సంఘం వారు నాచే రచింపఁబడిన నాటకము లనేకములు ప్రదర్శించుచుండిరి"[6] ఆనాడు నట సమ్రాట్టు బళ్లారి రాఘవాచార్యులు గారు "రామరాజు చరిత్ర" లో పటాణి పాత్ర ధరించి ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి శ్రీనివాసరావుగారికి మిక్కిలి ప్రచారం కొనితెచ్చారనడం అత్యుక్తి కాదు. 1915సం. ఏప్రిల్ 3, 4 తేదీలలో బళ్లారిలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభలో పాల్గొన్న చిలకమర్తి వారు "బళ్ళారి 'సరస వినోదినీ' (సుమనోరమ సభ అయి ఉండవచ్చు) నాటక సమాజము వారు మా నిమిత్తము (సభకాహూతులైన వారి నిమిత్తము) రెండు నాటకములు ప్రయోగించిరి. అందొకటి 'రామరాజు' ఆ నాటకములో శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులు గారు పఠాను పాత్ర ధరించి మిక్కిలి యద్భుతముగా నటించి, నాటకాంతమున విలువగల జరీ బనారసు పట్టుశాలువ యొకటి నాకు బహుమానముగ నిచ్చిరి"[7] అని వివరించారు.

పూర్వోక్తమైనట్లు నాటకీయ శిల్పమూ, రచనా శిల్పమూ గల శ్రీనివాసరావుగారి నాటకాలు ప్రదర్శనకు మిక్కిలి అనుకూలం గానే ఉండేవని తలంచడంలో విప్రతిపత్తి లేదు. వధ, యుద్ధం మొదలైన వాటిని చాలా వరకు శ్రీనివాసరావుగారు వదలిపెట్టారు. కాని తప్పని సరి అయినప్పుడు మాత్రమే వాటిని రంగంలో ప్రవేశ పెట్టడం జరిగింది. 'ప్రతాపాక్బరీయము' లో అక్బరు చిత్తూరుకోటను ముట్టడించి విజయం పొందడం ప్రదర్శించడం అంతసులభసాధ్యంకాదు.

---

5. సత్యహరిశ్చంద్రీయము - ఉపోద్ఘాతము పు. 1, 2.
6. పాదుకాపట్టాభిషేకము — పీఠిక - పుట 3.
7. స్వీయచరిత్ర - పుట. 324.

ఇక్లే హాల్దీఘాటు యుద్ధం పర్వతాల్లో జరిగింది. ప్రతాపుడు విల్లుల సాయంతో కోటను ముట్టడించి విజయం పొందడం గూడ ప్రదర్శనానుకూలంగా లేదు. కాని షార్కీ నాటక ప్రదర్శనానుసారం ఆ రోజుల్లోని రంగస్థల యుక్తుల (stage - tricks) తో వీటిని సైతం వారు ప్రదర్శించి ఉంటారని తలంచవచ్చు.

వీరి నాటకాలు ప్రదర్శన యోగ్యమైనవే అనడానికి మరొక పరమ నిదర్శనం కలదు. శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి గారు "ప్రహ్లాదచరిత్రలో అనేక సంఘటనలు ప్రదర్శనకి అసాధ్యం. అవి తొలగిస్తే అసలు కథకే మోసం. అటువంటి ప్రహ్లాద చరిత్రని ఆనాటికి సాధ్యమైనరీతిలో ప్రదర్శనకి అనువుగా వ్రాయడం శ్రీ కోలాచలం ప్రత్యేకత, ప్రదర్శనానుకూల్యం నాటకానికి పరీక్షానికషం[8]" అని కొనియాడి ఉండడం శ్రీనివాసరావుగారి ప్రతిభకు నిదర్శనం, ఉత్తమ ప్రయోక్తఅయిన శ్రీ కూర్మావారి ప్రశంస ఒక్క 'ప్రహ్లాద'కే పరిమితమైనా, కోలాచలంవారి నాటకాలన్నిటికీ ఇది వర్తిస్తుంది.

నాటక ప్రదర్శనకాలాన్ని గూర్చి ముచ్చటించడం గూడ అవసరమే. కోలాచలంవారి నాటకాల్లో దేనైనా ప్రదర్శించ డానికి ఏడెనిమిది గంటలకాలం పడుతుంది. కాని ఆనాటి ప్రజలకది ఆమోద యోగ్యమైనా, ఈ నాడు కుదరనిపని. ఇంతేగాదు, శ్రీనివాసరావు గారు 'రామరాజుచరిత్ర' రచించే సమయానికే నాటకం క్లుప్తంగా ఉండాలన్న అభిప్రాయం కలిగింది. "ఇప్పటికాలంబున నాలుగైదు ఘంటలకాలముకన్న హెచ్చుకాలము ప్రదర్శింపఁదగిన నాటకములు జనుల యోపికను బాపును గావున దీర్ఘముగఁబెంచి నాటకములు వ్రాయుట తప్పని యిపుడునేఁదెలిసితి". "ఈ (రామరాజుచరిత్ర)

8. తెలుగు వాఙ్మయము - సంగ్రహచరిత్ర - పు 2౬6

నాటకమాడనిచ్ఛయించువారు, దానిని జూచి తమ ఇష్టానుసారముగ ననుకూలము రీతి రంగములు హెచ్చుతగ్గులు చేసికొనవచ్చును."[9] అని వివరించారు. కాని "నిబిడ బంధముతో కవి నాటకమును రచింప లేదనుటకిది యాస్కారమొసంగుచున్నది"[10] అని డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తలంచారు. అయినా శ్రీనివాసరావుగారి సూచన ప్రదర్శనానుకూల్యాని కేగాని నిబిడతసడలి, రసవిచ్ఛిత్తికలగడానికి కాదని మనం భావించ వలసివుంది. కోలాచలంవారి దర్శకత్వంతో ఈ నాటకం అనేక పర్యాయాలు ప్రదర్శించబడి ఉండడంవల్ల, వారు స్వానుభవంతో, నాటక ప్రణాళికకు ఎలాంటి విఘాతమూ లేక ప్రదర్శనకు యోగ్యంగా మార్పులు సూచించి ఉంటారని తలంచడమే సమంజసం.

శ్రీనివాసరావుగారి ప్రతిభను గుర్తించి "శ్రీనివాసరావుగారు చిరకాలము నాటక సూత్రధారులుగనుండుటయేగాక, ఆంధ్రనాటకములలో చరిత్రాంశములఁగూర్చియు, పాత్రస్వభావ ప్రకటనమును గూర్చియునాటకకవులలోమార్గదర్శి 'మహర్షి' యననొప్పియున్నారు. వీరు నాటకకవులకును, పాత్రములుగానుండు వారికిని పంపిన 'విజ్ఞప్తి' వాస్తవముగ ననుభవసారమైన స్మృతి వాక్యముగ గారవింపదగి యున్నది."[11] అని బహుధా ప్రశంసించిన పురాణం సూరిశాస్త్రి గారి మాటలు అక్షరాలా సత్యం. ఇట్లు ప్రదర్శన యోగ్యంగా నాటక గౌరవాన్ని పరిరక్షించిన కోలాచలంవారు ప్రశంసాపాత్రులు

పై పరిశీలనవల్ల శ్రీనివాసరావుగారు నాటకరచనవల్ల నీతిబోధ, సంఘసంస్కరణ, రంగంలో ప్రయోగించడం అనే ప్రయోజనాల్ని సంపాదించి మహానాటక నిర్మాతకాగలిగారని సుస్పష్టమవుతుంది.

---

9. రామరాజుచరిత్ర — పీఠిక - పు. 1, 2.
10. తెలుగునాటక వికాసము - పు. 271.
11. నాట్యాంబుజము - పు. 281.

## మరికొన్ని విశిష్టగుణాలు

ఇతః పూర్వం వివరించబడిన నాటకీయశిల్పం, రచనాశిల్పం, రచనా ప్రయోజనం - అనేవాటితోపాటు శ్రీనివాసరావుగారిలో మరికొన్ని విశిష్టగుణాలు కలవు. వాటిలో సహజసుందరమైన వారి హాస్యపోషణ, విషాదాంత నాటకరచన, వారికిగల 'ఆంధ్రచారిత్రక నాటక పితామహులు'అనే ప్రతీతి సామంజస్యం, ఔచిత్య నిర్వహణ — అనేవి ముఖ్యమైనవి. వీటినిగూర్చిన వివరణతో శ్రీనివాసరావుగారి నాటకాల వైశిష్ట్యం పరిపూర్ణంగా తెలియడానికి వీలున్నది.

### హాస్య పోషణ

మానవజీవితంలో హాస్యానికధిక ప్రాధాన్యముంది. హాస్యశీలి దుర్భరపరిస్థితుల్లోను హాయిగా ఉండగలడు. హాస్యం సందర్భోచితమై ఉండడం అత్యంతావశ్యకం. సంస్కృతనాటకాల్లో ఎడనెడ హాస్యమున్నా అది విదూషకాదులకు పరిమితమవడంవల్ల దానికి విశిష్టత లేకపోయింది. ఆధునికాంధ్రకవులు, నాటకకర్తలు కొంతవరకైనా సరే హాస్యపోషణ చేయడం ప్రశంసనీయం. శ్రీనివాసరావుగారు గూడ తమ నాటకాల్లో సహజసుందరమైన రీతిని హాస్య ప్రయోగం చేశారు.

భరతముని హాస్యం ఒక రసమనీ, అది 'హాస' మనే స్థాయి భావంనుంచి ఉత్పన్న మవుతుందనీ నిర్వచించడం గమనించదగ్గది[1]. వికృతాకార వాగ్వేష చేష్టలుగల నటులవల్ల హాస్యం కలుగుతుందని విశ్వనాథుని నిర్వచనం[2]. ఇందులో ఆకారవేషాలకంటె చేష్ట, దాని కంటె వాక్సంబంధి అయిన హాస్యం — ఒకదానికంటె మరొకటి శ్రేష్ఠం.

శ్రీనివాసరావుగారు స్వభావతః గంభీర స్వభావులు. కనుకనే వారి హాస్యం చౌకబారుగా ఉండక సహజ గంభీరమై ఉంది. వీరి నాటకాల్లో ఎడనెడ హాస్యముంది. 'కాళిదాసు' నాటకంలో వీరు ప్రయోగించిన హాస్యం వేదం, గురజాడ, పానుగంటి వారల హాస్యానికి ఏమాత్రం తీసిపోదు. కాళిదాసు పూర్వజన్మ అయిన డంబరివానిద్వారా కోలాచలంవారు అందించినహాస్యం సహృదయుల ప్రశంసలకు పాత్రమైనది. వేదంవారి పేరిగాని హాస్యానికిగాని, గురజాడవారి కన్యాశుల్కంలోని వాగ్గతహాస్యానికిగాని ఏమాత్రం తీసిపోదు. ఆయా సన్నివేశాలలో డంబరవాని మాటలచే మనం కడుపుబ్బ నవ్వకుండ ఉండలేం. వీరి ప్రహసనాల్లో అధిక్షేపాత్మకమైన హాస్యం కలదు.

సంస్కృతనాటకాల్లో హాస్యోత్పత్తికి ఉపకరించే విదూషకులు చాలవరకు తిండిపోతులుగాను, మూర్ఖులుగాను ఉంటారు. శ్రీనివాస రావుగారి నాటకాల్లో అసలుకు సిసలైన విదూషకులు లేరు. అయితే

---

1. డా.పి.ఎస్.ఆర్. అప్పారావు గారు. నాట్యశాస్త్రము 6వ అధ్యా... పు.204, 205.

2 "వికృతాకార వాగ్వేష చేష్టాదేఃకుహకాద్భవేత్।
హాస్యో హాసస్థాయిభావః ..."-సాహిత్యదర్పణం-తృతీయ పరిచ్ఛేదం-శ్లో 214

'సుల్తానాచాందుబీ'లోని రఘునాథుడు, 'సుఖమంజరీపరిణయము' లోని సంజయుడు విదూషకులవంటి పాత్రలనే చెప్పాలి. వీరు కొంత వరకు హాస్యోత్పత్తికి ఉపకరించారు. ఇంకా వీరు నాటకాల్లో హాస్యం కోసం కొన్ని సన్నివేశాలను సైతం కల్పిస్తారు. ఇవి సందర్భోచితమై కథా శరీరంలో కలిసి ఉండి మనోహరత్వాన్ని చేకూరుస్తాయి. ఇట్టి సన్నివేశాలు 'కాళిదాసు, సుల్తానా చాందుబీ' మున్నగు నాటకాల్లో చూడవచ్చు.

వికృతాకార వేషాలవల్ల హాస్యం కలిగించడం రావుగారి నాటకాల్లో తరచు కనిపిస్తుంది. 'సుల్తానాచాందుబీ'లో రఘునాథుడనే విప్రవినోది జోరియా అనే మహమ్మదీయ స్త్రీ వేషం ధరించడం, ముసుగుతీయబోగా, అతడు పెట్టుకొన్న గడ్డం ఊడిపడిపోవడం అనే వికృతమైన వేషం, ఆకారాలవల్ల హాస్యం ఉత్పన్నమవుతుంది. ఈ సన్నివేశంలో ప్రేక్షకలోకం కడుపుబ్బ నవ్వగలదు. ఇట్లే 'కాళిదాసు'లో విద్యా సర్వస్వవేదినీ గృహంలో కాళిదాసును పరీక్షించేందుకు వచ్చిన ఏకాక్షి, వికలహస్తుడు, పంగువు-అనే వారి ఆకారాల వల్ల, ఇలాంటి హాస్యం అభిగమ్యమానం అవుతుంది.

ఇంతకంటే చేష్టవల్ల అభివ్యక్తమయ్యే హాస్యం శ్రేష్ఠమైంది, 'సునందనీ పరిణయము' లో సన్యాసి వేషంలో సునందని ప్రవేశించి, ఉగ్రసేనుని లేఖవల్ల సుమతి దౌష్ట్యాన్ని బయట పెట్టే సన్నివేశంలో సుమతి గజగజ వణకిపోతూ, కన్నీరు గారుస్తూ, ప్రతాపరాజునుద్దేశించి "ప్ర...ప్ర...ప్ర..." అంటూ తూలుతూన్న సమయంలో ఇట్టి హాస్యం స్పష్టం అవుతుంది ఇట్లే 'కాళిదాసు' లో పిచ్చివాడైన ముంజుని చేష్టలు, డంబర వాని గ్రామ్య చేష్టలు హాస్యానికి మిక్కిలి ఉపకరించాయి.

పై వాటికంటె వాగ్గత హాస్యం మిక్కిలి ఉదాత్తమైంది. దీనిని శబ్ద భావ, అర్థాల ననుసరించి మూడువిధాలుగా వింగడించ

వచ్చు. శబ్దాశ్రయ హాస్యం. "సీమంతిని" లో సీమంతినీ వివాహ సందర్భంలో రాజు పండితులకు బహుమతులిచ్చేటప్పుడు విద్యారాని భట్లు "మాటలు వచ్చును, తిండి తినుటకు వచ్చును, నిద్రవచ్చును, కోపము వచ్చునని వెంటనే చెప్పితినండి; చిత్రవర్మ మహా ప్రభువు ఫక్కున నవ్వి బాగుగా పరీక్ష యిచ్చితిరి. వలసినంత ధనముఁగొని పొండని ధనరాశిఁ జూపెనండి; మహా ప్రభువతఁడు" అని పల్కిన మాటలలో ఇట్టిహాస్యముంది. భావాశ్రయ హాస్యం : "సత్య హరిశ్చంద్రీయము'' లో నక్షత్రకుడు మతంగ కన్యలతో సంభాషించిన సందర్భం దీనికి చక్కని ఉదాహరణ:

"2 వ మతంగకన్య: స్వామీ! మా సౌభాగ్యము మీ ఆశీర్వాదఫలము గదా?

నక్షత్రకుడు: నిజము! మిమ్ము నాశీర్వదించుచు మీకు సౌభాగ్యము హెచ్చఁజేసితిని. నేను దారిద్ర్యముదెచ్చు కొంటిని.

1వ మతంగ కన్య: స్వామీ! ద్విజులకు దారిద్ర్యమనఁగా నేమి?

నక్షత్రకుడు: ఓహో! ఉపనయనము నాటి మాట యున్నది. కావున భిక్షమెత్తుకొని బ్రతుకవచ్చునని కదా నీ తలంపు. ఔరా తల పొగరు? నన్నా మీరు హాస్యము చేయునది?''

ఇందు భావాశ్రయహాస్యముంది. అర్థాశ్రయ హాస్యం: 'సత్య హరిశ్చంద్రీయము' లోనే నక్షత్రకుడు మతంగ కన్యలతో ...... '......ఇదిగో చూడండి. నా యుప్మారము నెఱపితిరేని మీకుఁగార్య సిద్ధి యగు. అటు చేయరేని మీకుఁజక్కగ దేహశుద్ధి యగు. ముఖ ప్రక్షాళనమగు అర్ధచంద్రప్రయోగంబగు,' "రాజదండన ప్రాప్తిరస్తు" అని పలకడంలో అర్థాశ్రయహాస్యముంది. ఇట్లైనాటకీయ వ్యంగ్యంతో కూడి హాస్యం ఉంటుందన్న విషయం పూర్వోక్తం.

శ్రీనివాసరావు గారి నాటకాల్లో మరొక విధమైన హాస్యం గూడ ఉంది. పాత్రల శీలంలోను, స్వభావంలోను పూర్వాపర వైరుధ్యం ఉంటే హాస్యముత్పన్న మవుతుంది. ఇలాంటిది వీరి నాటకాల్లో కలదు. 'సుల్తానా చాందుబీ' లో డాండియాగో తన దౌష్ట్యాన్ని కప్పిపుచ్చుతూ, మేరీతో సన్మార్గుని లాగా మాటలా డడంలోను, 'కాళిదాసు' లో మదనసేనను బలాత్కరించబోయి విఫలుడై, విక్రమరాజు రాగా అతనితో ఉపాధ్యాయుడు అసత్య మాడి సన్మార్గునిలాగా నటించడంలోనూ-ఇలాంటి హాస్యం స్పష్టం అవుతుంది. ఇట్లు శ్రీనివాసరావు గారు తమ నాటకాలలో బహు ముఖాలుగా సున్నితమైన హాస్యం ప్రయోగించి కృతకృత్యు లయ్యారు.

## విషాదాంతనాటకాలు

అతి మాత్రమైన పాశ్చాత్య నాటక పరిచయం గల శ్రీనివాస రావుగారి నాటకాల్లో విషాదాంత నాటక లక్షణాలుండడంలో అసా మంజస్యం లేదు. 'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని కావ్యాని' అనే సూత్రంవల్ల సంస్కృతంలో విషాదాంతనాటకాలుండ డానికి అవకాశం లేకపోయింది. షేక్స్పియర్ 'ట్రాజెడీ' ల ప్రభావం శ్రీనివాసరావుగారి నాటకాలపై ప్రసరించింది. దానితో తల్లక్షణాలు కోలాచలం వారి నాటకాల్లో కనిపిస్తున్నాయి. వీరు మరాఠీ నుంచి అనువదించిన 'రాక్షసీ మహత్వాకాంక్ష' చక్కని 'ట్రాజెడీ' అని తెలుస్తున్నది కాని వీరు 'ట్రాజెడీ'ని విషాదాంతనాటక మనక 'గంభీర నాటక' మని పేర్కొన్నారు.[3] సంస్కృత లాక్షణికుల మతాను సారం నాటకంలో నాయకవధ చూపగూడదన్న విషయం పాటించిన వారు వీరు. కాని చారిత్రక నాటకాల్లో నాయకవధ చూపినా ఫరవా

3. మానాపమాన నాటకము-పీఠిక- పు 3.

లేదని వీరి మతం.[4] కనుక వీరి చారిత్రక నాటకాలు చాలా వరకు మరణాంత విషాదాంతాలై ఉన్నాయి. తక్కిన వాటిలో నాయికా నాయకుల మరణం ఉన్నా వారు పునరుజ్జీవితులైనట్లు కూర్చబడింది.

శ్రీనివాసరావుగారి నాటకాల్లో విషాదాంత నాటకాల వంటివి కొన్ని, కష్ట భూయిష్ఠమై, దుర్భరశోకపూరితమై ఉండినా మోదాంతమైనవి కొన్ని కలవు. వీటిని క్రింది విధంగా వివరించవచ్చు 'కీచకవధ, ప్రహ్లాద, శిరోమణి' నాటకాల్లో దుష్ట పాత్రలవధ వర్ణించ బడడం వల్ల విషాదాంత నాటకాల్లో చేరవు. 'మైసూరు రాజ్యాభి వృద్ధి, చంద్రగిర్యభ్యుదయము' నాటకాల్లో అప్రధానపాత్రల వధవల్ల కలిగే శోకం, తరువాత సంభవించిన విజయానందాలతో కప్పివేయ బడుతూంది 'సత్యహరిశ్చంద్రీయము, కుశలవ' నాటకాలు చిత్త సంక్షోభ పరితాపాత్మకమై కలవు. సత్యసంధుడైన హరిశ్చంద్రుడు కాటికాపరిగా ఉండగా భార్య చంద్రమతి తల ఖండించ వలసి వస్తుంది. తన కర్తవ్యాన్ని గాని, సత్యనిష్ఠను గాని విడనాడని మహాధీరుడు హరిశ్చంద్రుడు. సత్య నిష్ఠా కర్తవ్యాలకు. భార్యా మమకారానికి మధ్య హరిశ్చంద్రుని చిత్తంలో సంఘర్షణం జరిగింది. కాని మమ కారం దూరమై సత్యనిష్ఠాకర్తవ్యాలే జయించాయి. విశ్వామిత్రునిచే సృష్టించబడిన కష్ట సముద్రాన్ని సత్యనిష్ఠాకర్తవ్యాలనే తెప్పవల్ల హరిశ్చంద్రుడు తరించ గలిగాడు. 'కుశలవ' నాటకంలో రాముని మనస్సులో సీతాప్రేమకు, రాజుగా తానాచరించవలసిన కర్తవ్యానికి సంఘర్షణ జరిగింది. కర్తవ్యం జయిస్తుంది. ఇట్టి నాటకాలు 'అభి జ్ఞాన శాకుంతలము, ఉత్తర రామచరితము' అనే సంస్కృత నాట కాల్లాగా చిత్త సంక్షోభాత్మకమై కలవు. 'బభ్రువాహన, సుల్తానా చాందుబీ, శిలాదిత్య' నాటకాలు వధాత్మకమైనవి. 'బభ్రువాహన'లో

4. The Dramatic History of the World-Rules-p. 2.

అర్జునుడు బభ్రువాహనునిచే వధించబడి పునర్జీవితుడవుతాడు. ఇందులో తండ్రితో యుద్ధం చేయడమూ మానడమూ అన్న భావ సంఘర్షం బభ్రువాహనునిలో కలిగింది. 'సుల్తానా చాందుబీ' లో అనేక మరణాలు కలవు. కాని అస్మన్ బేగు, డాండియాగో, హమ్మీ దుల వంటి దుష్టులవధ సుఖాంకంతో సంతోషాన్నే కలిగించింది. కాని చాందుబీ వధ మాత్రం హృదయ విదారకమైంది; శోకం వీడ లేరు ప్రేక్షకులు. కాబట్టి దీన్ని వధాంతనాటకమనే చెప్పవలసి ఉంది. ఇంక 'శిలాదిత్య' మోద విషాదాంతాలుగా రెండు విధాలుగా రచితం. శిలాదిత్యుని మరణానంతరం కళావతీ మదనుల మరణంతో ముగిసే నాటకం విషాదాంతం; గుహుని పట్టాభిషేకంతో కళావతీ మదనులు సన్మార్గులుగా మారడంతో గలది మోదాంతం. కాని కళావతీ మద నులవధ దుఃఖానికి ఆకరం కాదు; వారికది తగిన శిక్ష. కనుకనే ఇది గూడ వధాంతనాటకమే అనవలసి ఉంది.

వాస్తవంగా విషాదాంత నాటకాలని చెప్పదగినవి 'రామ రాజుచరిత్ర, పాదుకాపట్టాభిషేకము' అనేవి రెండు. వీరి ప్రసిద్ధ నాటకం 'రామరాజుచరిత్ర' ఇది విషాదభావ సంభరితమై ఒప్పుతూంది. విషాదనాయకున (Tragic-hero) కు ఉండవలసిన లక్షణాలన్నీ పటా ణిలో ఉండడంవల్ల 'రామరాజుచరిత్ర' ఉత్తమ విషాదాంత నాటకం. ఈ విషయం పటాణి పాత్రచిత్రణను గూర్చి వివరించిన సందర్భంలో స్పష్టంచేయడం జరిగింది. 'రామరాజుచరిత్ర'లోని విషాదభావాలను పురస్కరించుకొని అసామాన్య నటశేఖరుడైన బళ్లారి రాఘవా చార్యులుగారు విషాదాంత నాటకంగా ప్రదర్శించారు. పటాణి రామ రాజును యుద్ధంలో వధించిన వెనుక పశ్చాత్తప్తుడై దానికి కారకు రాలు ఆషాబీ అని ఎంచి, చంపి, తానాత్మహత్య గావించుకొని ప్రాణాలు వదలినట్లు విషాదాంతంగా మార్చి వారు నటించారు. ఆంధ్రప్రేక్షకలోకం ఆ నాటక ప్రదర్శనను గాంచి ఎంతగానో ఆనం

దించారట. కాని శ్రీనివాసరావుగారి కీమార్పునందిష్టం లేదు. "ఈ నాటకము మోదాంతముగ నేనొర్చితిని. అయిన నిచట సుమనోరమ సభవారు దానిని ఖేదాంతముగ మార్చినారు. అనఁగా పటాణి యున్మాదుండై యించుక పిచ్చి తెలిసియున్న కాలమునం దాపాబి తన్నాడిన పలుకు లకుఁగినిసి యాపాబీనిఁజంపి తను జంపుకొనె నని మార్చినారు. ఇది యు సరియయిన మార్గమని కొందఱి యభిప్రాయంబు. ఇందులకు భిన్నాభిప్రాయంబు నైతము గలదు"[5] అనికోలాచలంవారు తమ అభిప్రాయాన్ని స్పష్టం చేశారు. ఈ నాటకాన్ని మోదాంతం కావించడమే వీరి అభిమతం. అయినా వీరికిగల ఆంగ్లనాటకాల అతిమాత్రపు పరచయంవల్ల ఆంగ్ల విషాదరూపక ప్రభావం 'రామరాజుచరిత్ర'పై పడి విషాదాంత నాటక లక్షణాలన్నీ సమకూరాయని తలంచవలసి ఉంది. "మఱియు నిందు (రామరాజు చరిత్రమందు) నాటక ప్రపంచచారిత్రకులైన శ్రీనివాసరావుగారు తమ యాంగ్ల నాటక పరిచయ సంపత్తిచే షేక్స్పియరు కృతులలో హ్యామిలెట్, బ్రూటస్ పాత్రముల మనోవృత్తుల గొన్నింటిని తమ పటానుని అలంకరించినందుననీ నాటకమున రసోద్రేకము మిక్కుటముగ జేరి యున్నది. మఱియు నాట్యచమత్కృతికి నవకాశములును మెండుగ నిందుగలవు.[6] అని పురాణం సూరిశాస్త్రిగారు మిక్కిలి ప్రశంసించడం పై అంశాన్ని ధ్రువపరచడమేగదా? ఇదేవిధంగానే "ఆధునిక నాటక కవులలో ప్రథమశ్రేణి యందుండఁదగిన కోలాచలం శ్రీనివాసరావు గారు వ్రాసిన 'రామరాజు' లేక 'విజయనగర సామ్రాజ్యాంత' మనెడి నాటకము నిక్కముగ విషాద నాటకమే[7] అని శేకుమళ్ల అచ్యుతరావుగారు ప్రస్తుతిస్తూ చెప్పిన మాటలు గమనించదగ్గవి.

---

5 'రామరాజు చరిత్ర' పీఠిక – పు 1

6. నాట్యాంబుజము – పు. 20?

7. ఆంధ్రనాటకములు – రంగస్థలములు – పు 87.

కనుకనే నటులీ నాటకాన్ని మార్చినా, మార్చకపోయినా దీనిలో విషాదాంత నాటక లక్షణాలన్నీ ఇమిడిఉన్నాయి. ఇదొక మహోత్తమ విషాదాంత నాటకం.

'పాదుకాపట్టాభిషేకము'న గూడ విషాద భావాలు వెల్లి విరిసినట్లు స్పష్టం అవుతుంది. దశరథునిలో విషాద నాయకలక్షణాలు కలవు. దశరథునికి రామునిపై అత్యంత ప్రేమ; రాముని యెడబాసి ఒక్క క్షణమైనా ఉండలేడు. విధిప్రేరణచే ఎడబాటుకలిగింది. రామువనవాసం వదలమని కైకను ప్రార్థించి విఫలుడయ్యాడు. పుత్రప్రేమ, సత్యనిష్ఠలకు దశరథుని మనస్సులో సంఘర్షం జరిగింది. సత్యనిష్ఠ జయించింది. అయినా ఉత్కృటమైన పుత్రవాత్సల్యంతో మిక్కిలి దుఃఖించాడు దశరథుడు. ఈ విరుద్ధభావసంఘర్షం వల్ల దశరథుడు ఉత్తమ విషాదనాయకుడనడంలో సందేహంలేదు. ఇట్లే మంథర దుర్బోధమూలంగా తాత్కాలికంగా దుష్టస్వభావ అయి రాముని వనవాసాని కంపి, భర్తృవిహీన అయి, భరతుడు సైతం తనను అసహ్యించుకోగా, కైక పశ్చాత్తప్త అయి భావ సంఘర్షానికి లోనవుతుంది. కనుక 'పాదుకాపట్టాభిషేకము' విషాదనాటక లక్షణ లక్షితమై కలదు.

ఇట్లు శ్రీనివాసరావుగారికిష్టంలేకున్నా పై రెండు నాటకాలు విషాదాంతాలు కావడం వారికిగల పాశ్చాత్యనాటకాల అతిమాత్ర పరిచయమనే చెప్పవలసిఉంది.

## 'ఆంధ్రచారిత్రక నాటక పితామహుడు'

కోలాచలంవారికి 'ఆంధ్రచారిత్రక నాటక పితామహు'డన్న బిరుదం కలదు. దీని సార్థక్యాన్ని గూర్చి సమీక్షించడం అవసరం. చరిత్రపైనా, చారిత్రకనాటకాలపైనా ఇంతటి అభినివేశం కల నాటకకర్త ఆంధ్రులలో లేరంటే అతిశయోక్తికాదు. ప్రసిద్ధాంగ్ల

నాటకకర్త షేక్స్పియరు నాటకాల్లో మూడోవంతు చారిత్రక నాటకాలు కలవు. అల్లే శ్రీనివాసరావుగారు రచించిన ఇరవై ఎనిమిదిలో ఎనిమిది నాటకాలు చారిత్రకాలు. చరిత్రనుంచి కథలను గ్రహించి నాటకీకరించడంవల్ల రెండు ప్రయోజనాలను వీరు ఆశించినట్లు గమనించవచ్చు. 1. ప్రజలకు దేశచరిత్ర తెలియజెప్పి, విజ్ఞానవంతులను జేయడం; 2. మౌలికమైన నాటకకర్తృ కల్పనాశిల్ప నైపుణ్యాం అభివ్యక్తం చేయడం — అన్న వీటిని "కేవల పౌరాణిక కథలు నాటకములుగఁబన్నుట యందు గ్రంథకర్తకు నితివృత్త కల్పనా కష్టం బేమియు నుండదనియును, జనసామాన్యమునకు, జరిత్రాంశములు బొత్తిగఁదెలియవుగావున, నవి నాటకంబులుగ వ్రాయుటచే నితివృత్త కల్పనా చమత్కృతి నగపఱుచుటయగాక, జనులకుఁజరిత్రాంశములు బోధింపనగునని యోంచి, తురుష్కులలో గొప్పరాణి యని ప్రసిద్ధికెక్కి, 'అమహ్మన్నగరు' రాజ్యము నేలిన 'సుల్తానాచాందుబీ' యను నామె చరిత్రంబు నాటకరూపంబున వ్రాసితి."[8] — అని స్పష్టం చేశారు కోలాచలంవారు. ఈ ఆశయంతోనే వీరు ఎక్కువ చారిత్రక నాటకాలు రచించి తమ విశిష్టతను నిలబెట్టుకొన్నారు.

చారిత్రక నాటక రచయితలలో ప్రథములు శ్రీనివాసరావుగారు "తెలుగులో మొదట చారిత్రక నాటకమును వ్రాసినది వీరు (కోలాచలం వారే)[9]" అని నిడదవోలు వేంకట రావుగారు స్పష్టంగా చెప్పారు. కోలాచలంవారి రెండో నాటకం 'సుఖమంజరీపరిణయము' చరిత్రాత్మకమైంది. ఇది 1895 లో రచించబడి 1896 లో ముద్రించబడింది. ధర్మవరం వారి 'రోషనారా శివాజీ' తరువాతి రచన. వేదంవారి 'ప్రతాపరుద్రీయము' 1897 లోను, 'బొబ్బిలి

8. సత్యహరిశ్చంద్రీయము — ఉపోద్ఘాతము. పు. 1

9. విజ్ఞాన సర్వస్వము — పు. 116 .

యుద్ధము' 1916 లోను ప్రకటించబడ్డాయి. కనుక కోలాచలంవారిదే ప్రథమ చారిత్రక నాటకం. వీరి తరువాతి చారిత్రక నాటకం 'సుల్తానా చాందుబీ' రచన 1899–1900 క్రీ. దీనిలో చరిత్ర యథాతథంగా గ్రహించబడింది ఆ వెనుక 'రామరాజు చరిత్ర' మొదలైన నాటకాలు రచిత మయ్యాయి. శ్రీనివాసరావుగారికి మిక్కిలి కీర్తి ప్రతిష్ఠలను సంపాదించి పెట్టిన నాటకం "రామరాజుచరిత్ర". ఇది ఉత్తమ చారిత్రక నాటకమని శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి గారి అభిప్రాయము. "ప్రథమ చారిత్రక నాటకం శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్య 'విషాదసారంగధర' అని కొందరి అభిప్రాయం. కాని సారంగధర కథ చారిత్రకం కాదు. ఆంధ్ర సాహిత్యానికి అంకురార్పణ చేసిన నన్నయభట్టు నాదరించిన రాజరాజుకి సంబంధించింది అసలేకాదు. తరువాత శ్రీవేదం వేంకట రాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయము' కూడా చారిత్రకనాటకమని మరికొందరి అభిప్రాయం. ఇందులో కథకూడా చారిత్రకం కాదు. విషాద సారంగధర, ప్రతాపరుద్రీయం మొదలైనవి చారిత్రకాభాస నాటకాలు (**Psudo-Historical plays**) మాత్రమే." చరిత్రాత్మకమైన ఇతివృత్తంకల చారిత్రక నాటకం శ్రీ కోలాచలం శ్రీనివాసరావు 'రామరాజుచరిత్ర'. దీనికి "ఫాల్ ఆఫ్ విజయనగర్" అని ఇంగ్లీషు పేరు [10] ఇట్టి రామరాజు చరిత్ర నాటకం మిక్కిలి ప్రసిద్ధి ప్రచారాలు పొందింది. ఇంకా ఇతర నాటకాల్లోను చారిత్రక విషయాలను సంపూర్ణంగా గ్రహించి నాటక రచన చేసి, నాటకీయ శిల్పంతోపాటు సర్వాంగ సౌందర్యాన్ని పరిరక్షించి ఉండడం ప్రశంసార్హం. ఈ చారిత్రక నాటకాల్లోను చిన్న చిన్న మార్పులు చేసినా, శ్రీనివాసరావు గారు చారిత్రక వైరుద్ధ్యాలను ప్రవేశ పెట్టనందుకు మనం సంతోషించక తప్పదు.

---

10. తెలుగు వాఙ్మయము—సంగ్రహచరిత్ర—పుటలు 291 – 293.

'ఉత్తమ చారిత్రక నాటక రచనవల్లనే శ్రీనివాసరావుగారికి 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహుు' డన్న బిరుదం కలిగింది. పెద్దనకు "ఆంధ్ర కవితాపితా మహు" డనీ, ధర్మవరం వారికి 'ఆంధ్ర నాటక పితామహు' డనీ బిరుదులు కలవు. పెద్దన ధర్మవరంవారలకు గల ఈ బిరుదులు ఎంతో సార్థకమైనవి ఇట్లే సమకాలికులు ఒకటి రెండు చారిత్రక నాటకాలు రచించినప్పటికీ, సంఖ్యలోనే గాక, గుణగరిష్ఠతలోను ఆధిక్యం వహించిన చారిత్రక నాటకాలు రచించి ప్రసిద్ధి కెక్కడంవల్లనే శ్రీనివాసరావు గారికి 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు' డన్న బిరుదం ప్రబలింది. ఇంతేగాక పైని వర్ణించినట్లు ప్రజా ప్రయోజనార్థమే చారిత్రక నాటకాలు రచించి, అనల్పకల్పనా శిల్పనైపుణ్యం, నిర్మాణ దక్షత-ఉండడం వల్లనే ఈ వాడుక సమంజస మని తలంచడంలో విప్రతిపత్తి లేదు అయితే వీరికీ బిరుదు ఆంధ్ర దేశచరిత్ర నుంచి కథలు గ్రహించి ఆంధ్ర భాషలో నాటకాలు రచించడం వల్లనా లేక చరిత్ర నుంచి కథల నెన్నుకొని ఆంధ్ర భాషలో రచించడం వల్లనా అనే విచికిత్స కలుగుతుంది. 'రామరాజు చరిత్ర, చంద్రగిర్యభ్యుదయము' అనే రెండు నాటకాల్లోని ఇతి వృత్తం ఆంధ్రదేశసంబంధి. ఈ చరిత్రాంశాలు ఆంధ్రులకు అభిమాన పాత్రమైనవి పైగా 'రామరాజు చరిత్ర' బహుళ జనాదరణకు పాత్రమై, విమర్శకులచే బహుధా ప్రశంసించబడిన సర్వోత్తమనాటకం. కాబట్టి ఆంధ్రదేశ చరిత్రను గ్రహించి నాటకాలుగా వ్రాయడంవల్లనే వీరికీ ప్రతీతి వచ్చి ఉంటుందని తలంచడమే ఉచితం. అయినా భారత దేశ చరిత్రలోని ముఖ్య విషయాలతో ఆంధ్ర భాషలో నాటకాలు రచించడం వల్లనూ శ్రీనివాసరావుగారికీ వాడుక కలిగిందన్నా అసమంజసం కాదు. అయినా సర్వోత్కృష్ట నాటకం "రామరాజు చరిత్ర" వల్ల నే శ్రీనివాసరావుగారికి 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు' డన్న బిరుదం కలిగింది ఈ చారిత్రక నాటక రచన వల్ల

కామాశించిన ప్రయోజనాలను సాధించారు; అందుచే వీరికి గల 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు' డన్న బిరుదం మిక్కిలి సమంజసమై ఒప్పుతూంది.

## ఔచిత్య నిర్వహణ

ఇంక చివరిగా శ్రీనివాసరావుగారి ఔచిత్య నిర్వహణను గూర్చి తెలుసుకోవడం అవసరం. రమ్యతరమూ, రస నిష్యంది అయిన నాటకంలో ఔచిత్యం నిర్వహించడంలో ఎంతయినాఆవశ్యకం ఉంది. అనౌచిత్యం కంటె రసభంగ కారణం మరొకటి ఉండదని ఆనందవర్ధనుని మతం.[11] రస నిర్భరమైన నాటకరచనలో శ్రీనివాస రావుగారు ఔచిత్య భంగ మొనర్చక పోవడం మిక్కిలి ప్రశంసనీయం. వారు ఇతివృత్త నిర్మాణంలోను, పాత్రపోషణలోను, సన్నివేశ కల్పనలోను, సంభాషణ రచనయందు, పద్యాలు, పాటలు ప్రయోగించడంలోను, భాషా ప్రయోగంలోను, నీతిబోధలోను, హాస్య ప్రదర్శనంలోను, నిషిద్ధాలైన ఆలింగనచుంబనాదులను పరిత్యజించడం లోను శ్రీనివాసరావుగారు ఎంతో సంయమనంతో, విమర్శనాత్మక దృష్టితో కళామయం గావించి, ఔచిత్యపరిరక్షణచేయడం పూర్వోక్త విషయాలవల్ల మనకు స్పష్టమైంది. ఇవి శ్రీనివాసరావుగారిలో గల మహోరూపక నిర్మాత లక్షణాలకు పరమ నిదర్శనాలనడంలో సందేహ ముండనక్కరలేదు.

అయినా శ్రీనివాసరావుగారి కనుగప్పి ఒకటి రెండు దొసగులు దొరలినట్లు తెలియకపోదు. 'సుఖమంజరీ పరిణయము' లో సుఖమంజరి మంత్రి నుద్దేశించి 'చూడరా, ఏలరా, మానరా'. అని అనడం, 'మదాలస'లో ఋతుధ్వజుడు తన తండ్రి అయిన శత్రుజిత్తును 'ఏలర, చాలుర,' అని అనడం అంతగా బాగుండలేదు. 'సునందనీ

11. ధ్వన్యాలోకము -III- శ్లో 15.

పరిణయము' లో జయమాలిని సుదేవునిపై గల తన మోహాన్ని తండ్రికి తెలిపి, పెండ్లి చేయమని కోరడం 'సుఖమంజరీ పరిణయము' లో విషయసేనుని ఆజ్ఞతో సాయన సుఖమంజరిని తన రాజు వద్దకు మదనకేళికి రమ్మని పిలవడం అంత ఉచితంగా కనిపించవు. 'శిలాదిత్య' లో సూర్యోపాసనా ఫలితంగా పూర్ణగర్భిణిఅయిన వితంతువు 'సుభగ' తానే తన అవయవవర్ణన చేసుకోవడం ఉచితంగా లేదు.

''మిన్నయి సన్నగా నున్ననాలేఁగౌను
 గరువంపు గరిమమై బరఁగె నేఁడు,
రాగోరు రుచులచే రాజిల్లు చను మొనల్
 నీలకాంతి వహించి నెగడెనేఁడు,
చిగురుల జిగికాంతిఁ జెలువుఁ గాంచినమోము
 వెల్వెలఁ బాఱుచు వెలయునేఁడు,
మించె నిట్టూర్పు జనించె నురుశ్రాంతి
 కొంచెపుటూరు గాన్పించెనేఁడు

నడలకును మందభావంబులడరెనేఁడు,
యొడలకాంతికి జిగిహెచ్చి యొప్పెనేఁడు,
కడుపు బరువయి కాన్పించె; ఘనతఁగాంచి
దైవమా యేమి తెలుపుదుఁ దండ్రికిపుడు.''

—ఇలాంటి వర్ణనలు శ్రవ్యకావ్య సామాన్యమే అయినా నాటకంలో ఉచితం కాదని తలంచవలసి ఉంది. 'సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము, మదాలస, శిలాదిత్య' — అనే నాలుగు నాటకాలలో తప్ప వీరి ఇతర నాటకాల్లో ఈ మాత్రం దొసగులు గూడ లేవు; అనౌచిత్యానికి ఆస్కారం లేదు.

అనౌచిత్యం పరిహరించి, ఔచిత్యస్ఫోరకంగా నాటక రచన చేయడమే శ్రీనివాసరావుగారిలోని విశిష్టగుణం. ఈ విషయం ఒక్క ఉదాహరణతో ముగించడం ఉచితం. 'సీమంతినీ' నాటకంలో సామ వంత సుమేధులను పటువులు సామవతీ సుమేధులనే దంపతుల వేషంతో సీమంతిని వద్దకు వెడతారు. సీమంతినీ పాతివ్రత్య మహిమ వల్ల నిజంగానే సామవంతుడు సామవతిగా మారిపోతాడు. ఆ సంద ర్భంలో సామవతి సుమేధునితో తన మోహం వ్యక్తం చేసిన పద్యం ఎంతో ఔచితీబంధురంగా ఉంది.

"అలనాఁడు వాయనమందిన తటినుండి
నిజముగు నెలఁతనై నెగడుదాన,
గుట్టుఁదాఁపఁగజూచి పట్టఁగ లేనైతి
నంగజు నలజడి యధికమయ్యె,
అలమటవలదిఁక నరయుమా ననునీవు
నలుగొలఁయుంచుక హైనవలదు,
కబరీభరమ్మును గనువిచ్చి కనుగొమ్మ
పుట్టి నట్టిదొగాక పెట్టినదియొ,
మొగము కనుఁగవ మెడనడుములను గనుము
నమ్మకున్నాను నీకెద్ది నమ్మికయగు
నట్టి యనువుల నరయుచు దిట్టవగుము
కాని విడనాడనోపను గంతుదాడి."

—అని తన నిజస్థితిని స్పష్టం చేసింది. ఈ సందర్భమెంతో ఔచితీ సహామై ఒప్పుతూంది. ఇట్లు శ్రీనివాసరావుగారు నాటకాలను ఔచిత్య సహితంగా రచించి తమ విశిష్టతను నిలబెట్టు కొన్నారు.

# శ్రీనివాసరావుగారి సేవ

కోలాచలం శ్రీనివాసరావుగారు తెలుగునాటకరంగానికి, సాహిత్యానికి చేసినసేవ అపారమూ, అనన్యసామాన్యమూ, అనితర సాధ్యమూ అంటే అతిశయోక్తికాదు; స్వభావోక్తి. శ్రీనివాసరావుగారు రచించిన నాటకాల సంఖ్యవల్లనే కాక వారి నాటకాల్లోని ఉత్తమగుణాధిక్యం వల్లసైతం నాటక కర్తగా వారి వైశిష్ట్యం స్పష్టమయింది.

శ్రీనివాసరావుగారు నాటకాలు రచించి అచ్చొత్తించి భద్రపరచడమే లక్ష్యంగా తలంచలేదు; వాటిని రంగస్థలంపై ప్రయోగించడమే పరమప్రయోజనంగా ఎంచారు; అంతమాత్రంచేత నాటకరంగంలో ప్రదర్శనసమయంలో విజయంపొందితే చాలని తలంచలేదు. వీరు తమనాటకాలకు సాహిత్యగౌరవంసైతం సంపాదించడమూ ముఖ్యమనిభావించారు. అంటే శ్రీనివాసరావుగారి నాటకాలకు రంగప్రయోజనంతోపాటు సాహిత్యగౌరవం గూడ చేకూరడం గమనించదగ్గది.

శ్రవ్యకావ్యకర్తకంటె నాటక కర్తృ బాధ్యతలు అధికమనడం సర్వజనవిదితమే. ఏ విషయమైనా శ్రవ్యకావ్యం కావచ్చు; కాని నాటకం

కాజాలదు; కాబట్టి కథావస్తువును స్వీకరించడంలోనూ, దానిని నాటకీకృత్తంగా మలచుకోవడంలోను, నాటకకర్తృ నైపుణ్యం పరిస్ఫుటమవుతుంది. శ్రీనివాసరావుగారిలోని ఇట్టి కౌశలం మందే స్పష్టమయింది. పాత్రచిత్రణలోను వీరి గొప్పదనం తెల్లమయింది. నాటక పాత్రలు పిండిబొమ్మలు, కర్రబొమ్మలు, గడ్డిబొమ్మలు లాగా కాక సజీవమూర్తులుగా ఉంటే నాటకానికిసైతం ప్రాణంరాగలదు. లేనిచో అది మృతప్రాయమే. వీరు సజీవపాత్రచిత్రణ చేసి, ఆయా పాత్రల మనస్తత్త్వాల్ని చిత్రీకరించడంతో వీరి గొప్పదనం వ్యక్తమయింది వీటిచే శ్రీనివాసరావుగారికి గల భారతీయ, పాశ్చాత్య రూపకమర్యాదల పరిజ్ఞానం సువ్యక్తమయింది. సన్నివేశకల్పనలోను, సంభాషణ రచనలోను, పాటలు, పద్యాలు, భాష—ప్రయోగంలోను వీరినైపుణ్యం అడుగడుగున గోచరిస్తుంది. నాటక కర్తకుండవలసిన సర్వశ్రేష్ఠగుణాలు వీరిలో కలవు. సంస్కృతాంగ్ల నాటక పఠనజన్యజ్ఞానం వీరి నాటకాలన్నిట మనకు స్పష్టంగా తెలుస్తుంది.

శ్రీనివాసరావుగారి నాటకాల్లో వైవిధ్యమెక్కువ. పౌరాణికాల సంఖ్య ఎక్కువేఅయినా, ఒక కల్పితనాటకం, ఒక సాంఘిక నాటకం, రెండు అనువాద నాటకాలతోపాటు, ఏ ఇతరాంధ్రనాటక కర్తకు సాధ్యంగానన్ని చారిత్రక నాటకాలు వీరు రచించారు. శ్రీనివాసరావుగారి ఉత్తమసేవకు నిదర్శనం ఇదొక్కటేచాలు పురాణ కథలను నాటకాలుగా రచించినందువల్ల నాటకకర్త కథాసంవిధాన నైపుణ్యం, కల్పనాచమత్కృతి స్పష్టంకావనీ, ఇవి చారిత్రకనాటకాల రచనవల్లనే సాధ్యమనీ వీరునమ్మి, నమ్మినదానిని తమ నాటకరచన వల్ల సమర్థంగా సాధించినవారు. చారిత్రకనాటక రచనతో ప్రజలకు చరిత్రాంశాల్ని తెలియజెప్పడం గూడ సాధ్యమవుతుందని వీరి ప్రగాఢ విశ్వాసం. అత్యధికసంఖ్యలో ఉత్తమ చారిత్రక నాటకాలు రచించడమే గాదు; ప్రప్రథమ చారిత్రకనాటక ప్రణేతగూడ వీరే. దీని మూలం

గానే 'ఆంధ్రచారిత్రక నాటకపితామహు' డన్న బిరుదం లభించింది వీరికి. ఇట్లు ఆంధ్రనాటక రంగానికి వీరు చేసినసేవ అపారమైంది.

ఉత్తమలక్షణ లక్షితమైన నాటకరచనవల్ల శ్రీనివాసరావుగారి వైశిష్ట్యం గోచరించి, వారిసేవ అభివ్యక్తమైంది. దీనికితోడు నాటకలక్షణాల్ని సైతం కూలంకషంగా తెలిసిఉండడం ఆ నాటకకర్త గొప్పదనానికి పరమ నిదర్శనం. అంటే నాటకకర్తకు నాటకలక్షణాలు తెలిసి ఉండడం విశేషమే. వాటిలో ఉత్తమమైనవీ, అవసరమైనవీ అయిన లక్షణాలతో నాటకాలు వ్రాయడం మరొక విశేషం. ఇట్టి విశిష్టగుణం శ్రీనివాసరావుగారిలో కలదు. వీరు బళ్ళారిలోని 'సుమనోరమసభా' నాటకసమాజానికి అధ్యక్షులు. అధ్యక్షులేకాదు; అందులో ముఖ్య నాటకప్రయోక్త. వీరి ఉత్తమ నాటక లక్షణాల పరిజ్ఞానానికి, ప్రపంచ మందలి నాటక చరిత్రాభిజ్ఞతకు పరమనిదర్శనం వీరి 'ప్రపంచనాటక చరిత్ర' (The Dramatic History of the World) అనే ఆంగ్ల గ్రంథం. దీని విశిష్టతను గూర్చి విపులంగా శ్రీనివాసరావుగారి నాటకేతర రచనలలో చర్చించడం జరిగింది. ఇది ఆంగ్లంలో రచించబడినా, ఏ ఇతర నాటకకర్తలకు ఇట్టి గౌరవం లభించలేదు. ఆ రోజులలో ఇలాంటి గ్రంథరచన చేయడంలో తెలుగులోనేకాదు, భారతీయ భాషల్లోనే శ్రీనివాసరావుగారు ఆద్యులు. అంటే వీరు నాటకరంగానికి చేసినసేవ ఎంతటిదో వ్యక్తమవుతుంది. నాటకరచనా ప్రయోగాలు రెండూ పరస్పరసహకారులు. ఈ రహస్యాన్ని గుర్తించిన శ్రీనివాస రావుగారు నాటకకర్తగాను, ప్రయోక్తగాను కృతకృత్యులయ్యారు. అంటే వారి అనుభవం స్పష్టమవుతుంది. ఈ అనుభవంతో ప్రపంచమందలి నాటకచరిత్రను గూర్చి, నాటకలక్షణాలను గురించి, నటుల గురించి వివరించడమేగాక, 'ప్రపంచ నాటక చరిత్ర' గ్రంథోపసంహారంలో నాటకకర్తలు, 'నాటకకంపెనీలు, నటులు, ప్రేక్షకులు మొదలైన వారనుసరించవలసిన సూచనలు అనేకం వివరించి ఉన్నారు. ఇవి

సార్వకాలికమేగాక, సర్వజనసమ్మతమై ఉండడం గమనించదగ్గవిషయం. ఇట్లు ఉత్తమ నాటకలక్షణాలనెరిగి తదుచితంగా నాటకరచన చేసి, నాటకకర్తగా నాటకరంగానికెంతో సేవ చేసిన శ్రీనివాసరావుగారు అసామాన్యులు; మనకు మాన్యులు. ఈ సందర్భంలో పురాణం సూరి శాస్త్రిగారి మాటలు స్మరించదగ్గవి. "శ్రీనివాసరావుగారు చిరకాలము నాటక సూత్రధారులుగా నుండుటయేగాక, ఆంధ్రనాటకములలో చరిత్రాంశముల గూర్చియు, పాత్ర స్వభావమును గూర్చియు నాటక కవులలో మార్గదర్శి, 'మహర్షి' యన నొప్పియున్నారు. వీరు నాటకకవులకును, పాత్రములుగ నుండు వారికిని, పంపిన 'విజ్ఞప్తి' వాస్తవముగ ననుభవసారమైన స్మృతివాక్యముగ గారవింపదగియున్నది."[1] సూరిశాస్త్రిగారి ఈ ప్రశంసా వాక్యాలవల్ల శ్రీనివాసరావుగారి మార్గదర్శిత్వంతో పాటు, వీరి సేవ సైతం స్పష్టమవుతుంది.

ఉత్తమ నాటక మర్యాదలను గుర్తించడమే గాదు; వాటి సాయంతో నాటకాలు రచించడమే గాదు; వాటిని ప్రదర్శించడంతోనే నాటక కర్త బాధ్యత పరిపూర్తికాగలదు. ఆ రోజులలో బళ్లారిలోనే గాదు, మొత్తం ఆంధ్రదేశంలోనే తగిన రంగస్థలాలు లేవు. పైగా "సుమనోరమ సభ"వంటి నాటకసమాజానికి ఉత్కృష్టమైందీ, అన్ని హంగులతో కూడిందీ అయిన నాటకశాల ఆవశ్యకమైంది. అందుచేతనే ప్రప్రథమంగా బళ్లారిలో 'వాణీవిలాసనాటకశాల'ను నిర్మాణం చేయించారు శ్రీనివాసరావు గారు. దీనికై వీరు రూ. 10,000 లు వెచ్చించారట. ఇది 1905 లో నిర్మితమైంది. దీనిని ప్రారంభించిన మహాశయులు లోకమాన్య బాలగంగాధరతిలక్కు గారు. వీరు శ్రీనివాసరావుగారి నాటక రచనా సామర్థ్యాన్ని, వారి నాటకశాలా నిర్మాణ కౌశలాన్ని మిక్కిలి ప్రశంసించారట. ఇట్లు

1. నాట్యాంబుజము – పుట 251.

శ్రీనివాసరావుగారు ఆ రోజులలో నాటకశాల లేని కొరతను తీర్చిన మహానుభావులు. ఇదొక పవిత్రకార్యం. దీనిచే శ్రీనివాసరావుగారు నాటకరంగానికి చేసినసేవ ఎంతటిదో స్పష్టమై, వారిగొప్పదనం తెలియకపోదు.

నాటకరచనా ప్రయోజనాల ద్వారా వినోదాన్నే గాక విజ్ఞానం సైతం ప్రజల కందివ్వదలచిన వారు రావుగారు కావుననే వీరు నాటకశాలను ఉత్తమ పాఠశాలగా ఎంచారు. తన్మూలంగా సంఘసంస్కరణను సైతం సాధించడానికి యత్నించారు కనుకనే నీత్యుపదేశంతోపాటు సంఘ సంస్కరణార్థం నాటకాలు రచించారు. నాటకీయ శిల్పానికి ఎట్టి విఘాతమూ లేక పై వాటిని వీరు సాధించడంలో నే వీరి గొప్పదనం స్పష్టమవుతుంది.

వీరు భాషా సాహిత్యాల అభివృద్ధిని కాంక్షించారు. పాత్రోచిత భాషా ప్రయోగంలో వీరికి ఆదరం లేదు. గ్రామ్య భాషను నాటకంలో ప్రయోగించడం వల్ల భాషాభివృద్ధి జరగదనీ, భాషను అభివృద్ధి పొందించడానికే యత్నించాలనీ, కనుకనే సలక్షణ భాషను వాడడమే సముచితమనీ వీరి మతం. అందుకే వీరు గ్రాంథిక భాషా వాదులుగ పేర్కొనబడడం పూర్వోక్త విషయం. నాటకాలలో పాత్రోచితంగా కాక రసభావానుగుణంగా సందర్భోచితంగా సలక్షణమైన భాషను ప్రయోగించడంలో శ్రీనివాసరావు గారు అందెవేసిన చేయి. సాహిత్యాభివృద్ధికి నాటకకవులు ప్రయత్నించాలన్నది వీరి మతం. ధర్మవరంవారు 'ప్రహ్లాద' నాటకంలో పోతన పద్యాలనే ప్రయోగించారు. దీనివలన సాహిత్యాభివృద్ధి జరగదని వీరు తలంచారు. "నేనీగ్రంథము (ప్రహ్లాద) ను రచింపకమున్నే కీర్తిశేషులైన డి. కృష్ణమాచార్యుల వారీ నాటకము వ్రాసి ప్రదర్శించి యుండిరి. అందున ననేక పద్యములు పోతనగారి భాగవతమునుండి యెత్తబడి యుండెను. ఒకానొకదినంబున వారితో నేను మాటలాడుచుండ

ప్రస్తాపవశమున భాగవతములోని పద్యములు మీ గ్రంథములో దూర్చిన ఫలమేమి యని ప్రశ్నించితిని. అంతటి రసవంతములైన పద్యములు రచించుట కష్టమగుకారణమున, నేనా పద్యములు గ్రహించితినని వారనిరి. అందఱు నిటులనే యొనరించినచో, నిప్పటి కవుల కవితాభివృద్ధికి మార్గముండదనియును, పోతనగారి పద్యమును శ్రీముఖముగ నుంచుకొని దానిశైలి ననుసరించి, పద్యముల్లు చుండి నచో గొన్ని ప్రయత్నముల మీఁదనైన నప్పద్యముల పోలిక పద్య ములు కవులు వ్రాయనలవడునని బదులిడితిని ..... ఆ శైలినిఁబట్టి నేను పద్యములు వ్రాసితిని.[2]" ఈ విధంగా శ్రీనివాసరావు గారు భాషా సాహిత్యాల అభివృద్ధి నాకాంక్షించి, నాటక రచన చేయడం జరిగింది.

సమకాలికాంధ్ర నాటక కర్తలకంటే శ్రీనివాసరావుగారిలో గల ప్రత్యేకతను తెలిపి, వీరావిధంగా ఆంధ్రనాటక రంగానికి చేసిన సేవ ఎలాంటిదో పరిశీలించడం అవసరం. వీరి సమకాలికులలో మొదట పేర్కొనదగినవారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. 'వాణీ విలాస నాటకశాల'ను నిర్మాణం గావించిన సందర్భంలో కందుకూరి వారు సంఘ సంస్కరణను గూర్చి ఉపన్యసించారు. దీనిచే కందుకూరి వారిపై రావుగారికి గల గౌరవం స్పష్టమయింది. కొంతవరకు 'సత్య హరిశ్చంద్రీయము,' రచనలో రావుగారు కందుకూరివారి 'హరిశ్చంద్ర' ననుసరించారు. రావుగారి 'ప్రహ్లాద' విశిష్టమైంది రావుగారి నాట కాలు శిల్పంతోపాటు, గద్యపద్య గేయాత్మకాలు. కందుకూరి వారి నాటకాలు కొలది పద్యాలుగల వచన నాటకాలనవచ్చు. కందుకూరి వారు సంఘ సంస్కరణార్థం అనేక ప్రహసనాలు రచించారు. కోలాచలంవారు మూడు నాలుగు ప్రహసనాలే వ్రాసినా, సాంఘిక దురాచారాల్ని దుయ్యబట్టి అవహేళన చేయడంతోపాటు అనల్ప

2. 'ప్రహ్లాద' ఉపోద్ఘాతము - పుట 5.

శిల్ప రామణీయకాన్ని జతచేయడంలో వీరి విశిష్టత గోచరిస్తుంది. అయినా కందుకూరివారు సంఘ సంస్కరణమన్న ధ్యేయాన్ని తమ ప్రహసనాల్లో సాధించారు. వాటికున్న ప్రచారమూ, ఆదరమూ తక్కిన వాటికి లేదంటే అత్యుక్తి కాదు.

తరువాత పేర్కొనదగినవారు ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు. వీరిద్దరు బళ్లారి వాస్తవ్యులు; న్యాయవాదులు; ధర్మవరంవారు 'సరసవినోదినీ సభ'కూ, కోలాచలంవారు 'సుమనోరమ సభ'కూ అధ్యక్షులు. ఇద్దరూ నాటకకర్తలు; ప్రయోక్తలు. ధర్మవరంవారు స్వయం నటకులు; కోలాచలం వారు ఎప్పుడూ వేషాలు వేయలేదు. ధర్మవరం వారికి ఒక చారిత్రకం (రోషనారా శివాజీ) వ్రాసినా - పౌరాణికాల మీదే అభిమానం. చారిత్రక నాటకాలమీదే అభిమానమైనా శ్రీనివాసరావు గారు అనేక ప్రసిద్ధపౌరాణికాలను సైతం రచించారు. 'ప్రహ్లాద, పాదుక, రుక్మాంగద, హరిశ్చంద్ర, చంద్రహాస, సీతాకల్యాణము' అనే నాటకాలు ఇద్దరూ వ్రాశారు. వీరిద్దరూ గద్యపద్య గేయాత్మకంగానూ, భారతీయ పాశ్చాత్య మర్యాదలలో ఉత్తమమైనవని తలంచిన వాటితో నాటకాలు వ్రాసి తెలుగు స్వతంత్ర నాటకాలకు పునాదులు వేసి, మార్గదర్శకులయ్యారు. ధర్మవరంవారు 'ఆంధ్రనాటక పితామహుడు'; కోలాచలంవారు 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహుడు.' ఇలాంటి పోలికలేగాక, ధర్మవరంవారికంటె కోలాచలంవారిలో మరింత విశిష్టత గోచరిస్తుంది. ప్రప్రథమంగా నాటకశాల నిర్మాణం చేయడం, 'ప్రపంచ నాటకచరిత్ర'కు కర్తకావడం ఇవి రెండూ శ్రీనివాసరావుగారిలోని గొప్పదనానికి నిదర్శనం. పాత్రల మనస్తత్త్వ చిత్రణలోను, చుంబన పరిరంభణాదులను పరిత్యజించి ఔచిత్యం పాటించడంలోను రావుగారే విశిష్టులు. విషాదాంత నాటక రచనకు ఆద్యులు ధర్మవరం వారైనా, 'విషాద సారంగధర' కంటె 'రామరాజు చరిత్ర మే'

ఉత్తమ విషాదాంత నాటకమనవచ్చు. విషాదాంత నాటకంలోని నాయకుడు విషాదభావ సంభరితుడై ఉండడం అవసరం. సారంగధరుడు మూర్తీభవించిన సచ్ఛీలం. అంతకంటె రావుగారి 'పటాణి' నిజమైన విషాదనాయకుడు. పద్యరచనలో రావుగారే మిన్న అన్న సంగతి పూర్వోక్తం. ధర్మవరం వారి నాటకాలకున్నంత ప్రచారం, కోలాచలం వారి నాటకాలకు రాలేదు. అయినా వీరి విశిష్టత అడుగడుగునా గోచరిస్తూనే ఉంటుంది దీనివల్ల సైతం శ్రీనివాసరావు గారి సేవ అవగతం కాక మానదు.

నాటకరచనలో చిలకమర్తి వారికీ, శ్రీనివాసరావు గారికీ పోలిక లేదు. చిలకమర్తి వారి గయోపాఖ్యానానికి వచ్చిన జనాదరణ అపారమైంది.

వేదం వేంకటరాయశాస్త్రి గారి నాటకాలు గద్యపద్యాత్మకాలే అయినా ఎడనెడ పాటలు కలవు. వీరి స్వతంత్రనాటకాలు మూడు మాత్రమే. వీరు సంస్కృత నాటక లక్షణాలను అనుసరించిన సంప్రదాయ బద్ధులు. శ్రీనివాసరావుగారీ విషయంలో మడిగట్టుకొన్నవారు కారు. 'ప్రతాపరుద్రీయము' వేదంవారు వ్రాసినా, చారిత్రక నాటకరచన కాద్యులు కోలాచలం వారన్న విషయం పూర్వోక్తం. పాత్రోచిత భాషావాదులు వేదంవారు. దీనికి భిన్నాభిప్రాయం కలవారు శ్రీనివాసరావుగారని ముందే తెలుపబడింది. వేదంవారు అసామాన్యమైన 'పేరిగాడు' పాత్రను సృజించగా, కోలాచలంవారు అనన్యసామాన్యమైన 'పటాణి' పాత్రను సృష్టించి, తమ కల్పనా శిల్పనైపుణ్యాన్ని ప్రకటించారు. 'పేరిగాడు', పిచ్చివాడైన 'చెకుముకి శాస్త్రి' – పాత్రల సృష్టితో అద్భుతమైన మరపురాని హాస్యం వేదంవారందివ్వగా, కోలాచలం వారు 'కాళిదాసు'లోని 'డంబరవాడు' పిచ్చెత్తిన 'ము ంజరాజు' పాత్రలతో సునిశితమైన హాస్యం పోషించారు.

సంఘ సంస్కరణకు, భాషా సంస్కరణకు, హాస్యానికి చక్కని ఉదాహరణ గురజాడవారి 'కన్యాశుల్కము.' సంఘ సంస్కరణాభిలాష కోలాచలంవారిలోను కలదన్న సంగతి పూర్వోక్తం; హాస్యం వీరి నాటకాల్లోను కలదు. కాని వీరు వ్యావహారిక భాషా ప్రయోగాన్ని అంగీకరించలేదు. గురజాడ వారిది ఒకే నాటకమైనా ఆంధ్ర నాటక రంగంలో దాని వైశిష్ట్యం దానిదే. శ్రీనివాసరావుగారి దృక్పథంవేరు; భాషాభివృద్ధి నాకాంక్షించిన వారు వీరు.

నాటక సంఖ్యలో దాదాపు కోలాచలంవారితో పానుగంటి వారు సమానులు. నాటకంలో వృత్తాలు ఉండరాదనీ, వాటిని రాగ యుక్తంగా పాడరాదనీ పానుగంటివారి అభిమతం. దీనికి కోలాచలం వారి మతం భిన్నమైంది. సంఘ సంస్కరణ ఇద్దరిలోను సమానమే. పానుగంటివారిలో హాస్యం సహజగుణమే అయినా కొన్నిచోట్ల మరుదురు పాకానబడి అశ్లీల స్ఫోరకమైంది. కోలాచలం వారికిట్టి దోషమున్నట్లేదు; ఉదాత్తతే వీరి విశిష్టత. పానుగంటివారు రామాయణకథతో నాలుగు నాటకాలు రచించగా, శ్రీనివాసరావుగారు ఐదు నాటకాలు వ్రాయడం జరిగింది. పానుగంటివారి 'పట్టభంగ రాఘవము'తో పోల్చదగింది శ్రీనివాసరావుగారి 'పాదుకాపట్టాభిషేకము.' సంవాద కౌశలం గలవారు పానుగంటివారు. శ్రీనివాసరావు గారిలోను ఈ గుణం కలదు. దీనితోపాటు నాటకకర్త కుండవలసిన అనేక గుణాలు కోలాచలంవారిలో కలవని పూర్వ పరిశీలనవల్ల సువ్యక్తమైంది. అంతేగాక చారిత్రక నాటకరచనలో వీరు అసామాన్యులని విదితమైంది.

తిరుపతి వేంకటకవుల భారత నాటకాల కధిక ప్రసిద్ధి కలదు. శ్రీనివాసరావు గారు సైతం భారతసంబంధి నాటకాలు నాలుగు రచించినా వీటికంత ప్రచారం రాలేదు. వీరి శిరోమణి, బభ్రువాహన, కీచకవధ నాటకాలు మహానాటక నిర్మాత కుండవలసిన లక్షణాలకు

పర మోదాహరణ. తరువాతి కాలంలో వెలసిన తిరుపతి వేంకట కవుల నాటకాలు ఈనాటికీ మిక్కిలి ప్రజాదరణ పొందడానికి అ దలి పద్య రచనా పాటవమే హేతువు. అంతమాత్రం చేత రావుగారి పద్యాలు పనికి రాకపోయాయని అనుకోరాదు. ఆనాడు రావుగారి పద్యాలకు సైతం అధిక ప్రచారమే కలదు. కాని ఈనాడవి విస్మృత మయ్యాయి హరిశ్చంద్రనాటకాలనేకం ఉన్నా, బలిజేపల్లివారి నాటకానికే అధిక ప్రచారం. శ్రీనివాసరావుగారి 'సత్యహరిశ్చంద్రీయము' దానితో నేమాత్రమూ తీసిపోదు.

శ్రీనివాసరావుగారు కొన్ని విషయాలలో ఇతరులకు ఒరవడి గూడ పెట్టారనడంలో సందేహంలేదు. పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'లవకుశ' నాటకానికి శ్రీనివాసరావుగారి 'కుశలవ' నాటకమే మూలం. ఇందలి కల్పనలను గ్రహించి శాస్త్రిగారు అవన్నీ తమ సొంతమని చెప్పుకొన్నందుకు శ్రీనివాసరావుగారు నిరసించారు[3]. గద్యపద్య గేయాత్మక నాటక రచన తరువాతి నాటక రచయితలకు ఒరవడి అయింది. ముత్తరాజు సుబ్బారావుగారి 'శ్రీకృష్ణతులాభారం' మొదలైనవిందుకు చక్కని ఉదాహరణలు.

నాటకాల్లో పాశ్చాత్య నాటకపద్ధతి ననుసరించి దీర్ఘస్వగతాలు శ్రీనివాసరావుగారు ప్రవేశపెట్టారు. ధర్మవరం వారి నాటకాల్లోను స్వగతాలున్నప్పటికీ, స్వగతాలకు అధిక ప్రాముఖ్య ప్రచారాలు మాత్రం శ్రీనివాసరావుగారి నాటకాలవల్లనే వచ్చాయనడంలో విప్రతిపత్తిలేదు. ఈ దీర్ఘ స్వగతాలు నాటక కార్యగమనానికి ఉపకరించాయే గాని, విఘాతాలు మాత్రం కాలేదు. రస భావానుగుణమై, సందర్భోచితమై, పాత్రల చిత్తవృత్తులను స్పష్టపరుస్తూ నాటక రామణీయకానికి ఎంతగానో ఉపకరించాయి. ఈ దీర్ఘ స్వగతాలు

3. కుశలవ — ఉపోద్ఘాతము

శ్రీనివాసరావుగారి నాటకాలన్నిట సామాన్యమే. అయినా 'రామ రాజుచరిత్ర'లో 'పటాణి'కి గూర్చినవి అత్యంత మనోహరమై ఉండ డమేగాక, అవే తరువాతి నాటకకర్తలకు ఒరవడి అయ్యాయి. ఈ స్వగతాల అభినయమే తదనంతరకాలంలో తెలుగుదేశంలో ఏక పాత్రాభినయంగా మారి ఉండవచ్చునని భావించడంలో తప్పులేదు.

శ్రీనివాసరావుగారు బహుభాషాకోవిదులు. సంస్కృతాంధ్రాంగ్లకర్ణాట భాషలలోనేగాక, మహారాష్ట్ర భాషలోను వీరికి చక్కని పాండిత్యముండేది. పూనానుంచి 'కేశవగంధర్వ, బాలగంధర్వ' అనే 'నాటకకంపెనీలు' బళ్లారికి వచ్చి ప్రదర్శించిన 'మానాపమానము, రాక్షసీమహాత్వాకాంక్ష' అనే రెండు నాటకాలను శ్రీనివాసరావుగారు తెలుగులోని కనువదించారు. ఆవిధంగా మహారాష్ట్ర భాషా సాహిత్యాలను ఆంధ్రులకు రుచి చూపించడమనే సేవ గూడ వీరు చేశారు.

నాటకాలు, నాటకేతర రచనలు—అనే మహాసాహిత్య సృష్టి వల్ల శ్రీనివాసరావుగారి అనన్య సామాన్యమైన సాహిత్యమూర్తి మహత్తరమై దర్శనమిస్తూంది.

ఇట్లు శ్రీనివాసరావుగారు సంఖ్యలోనేగాక ఉత్తమగుణగణా ల్లోను ఆధిక్యంగల ఇరవై ఎనిమిది నాటకాలు రచించి, నాటకరంగా భివృద్ధిని కోరి అధిక ధనం వెచ్చించి ప్రప్రథమంగా 'వాణీవిలాస నాటకశాల'ను నిర్మాణంగావించి; 'ప్రపంచనాటకచరిత్ర' ఆంగ్లంలో రచించి, అనితర సాధ్యమైన ఉత్తమ చారిత్రక నాటకరచనచే 'ఆంధ్ర చారిత్రక నాటకపితామహు'డన్న చిరుదుకు పాత్రులై, స్వతంత్ర నాటకరచనలో తమ ఒరవడిని నిలబెట్టుకొని ఆంధ్రనాటక వాఙ్మయా నికి, నాటకరంగానికి ఎనలేని సేవచేసి సమున్నత స్థానాన్ని ఆక్ర మించుకున్నారు. "నాటకరచయితగా, ప్రయోక్తగా, లాక్షణికు

డుగా కోలాచలం శ్రీనివాసరావుగారు తెలుగు నాటక రంగానికి చేసిన సేవ అమూల్యమైనది[4]" - అనే శ్రీనివాసచక్రవర్తిగారి ప్రశంసా వాక్యాలు అక్షరాలాసత్యం! తెలుగు నాటకకవులకు 'మార్గదర్శి,' 'మహర్షి' అని శ్రీనివాసరావుగారిని గూర్చి ప్రస్తుతించిన పురాణం సూరిశాస్త్రిగారి మాటలు చాలు వారి గొప్పదనానికి! ఇట్లు తెలుగు నాటక కర్తలలో విశిష్టతా ప్రత్యేకతలను నిలబెట్టుకొన్న మహామనీషి కోలాచలం శ్రీవాసరావుగారు !.

---

4. తెలుగు నాటక కవులు - పుట 50.

# కోలాచలంవారి రచనలు

**నాటకాలు**

1. కాళిదాసు
2. కీచకవధ
3. కుశలవ
4. గిరిజాకల్యాణము
5. చంద్రగిర్యభ్యుదయము
6. చంద్రహాస (అలభ్యం)
7. ద్రౌపదీ వస్త్రాపహరణము
8. పాదుకా పట్టాభిషేకము
9. ప్రతాపాక్బరీయము
10. ప్రహ్లాద
11. బభ్రువాహన
12. మదాలస
13. మానాపమానము
14. మైసూరు రాజ్యాభివృద్ధి
15. యువతీ వివాహము (అలభ్యం)
16. రామరాజు చరిత్రము (**The Fall of VijayaNagar**)
17. రాక్షసీ మహాత్వాకాంక్ష (అలభ్యం)
18. రుక్మాంగద
19. లంకా దహనము

20. శిరోమణి
21. శిలాదిత్య
22. శ్రీరామజననము
23. సత్యహరిశ్చంద్రీయము
24. సీతాకల్యాణము
25. సీమంతిని
26. సుఖమంజరీ పరిణయము
27. సునందనీ పరిణయము
28. సుల్తానా చాందుబీ

ప్రహసనాలు

1. అన్యాయధర్మపురి మహిమ
2. ఆచారమ్మన ప్రహసనవు (కన్నడం)
3. నాచిపార్టి
4. సమయమునకు భార్య (అలభ్యం)

నాటకేతర రచనలు

1. ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము (పద్యకావ్యం)
2. **The Dramatic History of the World** (ఆంగ్లం)
3. భగవద్గీతా విమర్శనోపన్యాసాలు (12)
4. వేదవిమర్శనోపన్యాసాలు (15)
5. ఇతర విమర్శనోపన్యాసాలు (9)